# కొత్తపల్లి పిల్లల కథల పుస్తకం-43 నవంబరు 2011

**మూలం: http://kottapalli.in/2011/11/welcome**

**మొత్తం ప్రతుల సంఖ్య:** 2000

**సంపాదకులు:** నారాయణ

**ముఖచిత్రం:** వీరాంజనేయులు

**అక్షర కూర్పు:** *కొత్తపల్లి*

ఇంటర్నెట్‌లో ఈ పుస్తకాన్ని వివిధ ఫార్మాట్లుల్లో ఉచితంగా చదవవచ్చు, డౌన్లోడు చేసుకోవచ్చు, అవసరమనిపిస్తే మీ వాణిజ్యేతర కార్యక్రమాలకోసం మీ అంతట మీరే దీన్ని ముద్రించుకోవచ్చు!



కొత్తపల్లి ప్రచురణలు

యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి- 515 101, అనంతపురం జిల్లా.

ఫోను: **08559 240222, 7702877670** ఇ-మెయిలు: **team@kottapalli.in**




# విషయ సూచిక

# భారత్ మాతా కీ జై!

"టీచర్! ఆరోజున చాచా నెహ్రూ గురించే మాట్లాడాలా, టీచర్!?"

"అవును. నవంబరు పధ్నాలుగు జవహర్లాల్ నెహ్రూ పుట్టినరోజు కదా? అందుకనే మనం ఆ రోజును బాలల దినోత్సవంగా జరుపుకుంటున్నాం. ఆ రోజున మనం అందరం నెహ్రూజీని గుర్తుచేసుకోవాలి"

పిల్లలందరూ తలలూపారు. ఎవరికి వాళ్ళు వాళ్ల అమ్మా నాన్నలతో చాచా నెహ్రూ గురించి పదో-ఇరవయ్యో వాక్యాలు రాయించుకొని బట్టీ పట్టారు.

రాము తల్లిదండ్రులిద్దరికీ చదువురాదు; వాడు కొంచెం బద్ధకస్తుడు కూడా.

అందుకని పదమూడో తేదీ వరకూ ఏమీ చెయ్యలేదు. ఆరోజు సాయంత్రం గుర్తుకొచ్చింది.. ఏం చెయ్యాలి?

వాళ్ల బడిలో టీచర్లు ఎవ్వరూ ఊళ్ళో ఉండరు- అందరూ పట్నంనుండి వచ్చిపోయేవాళ్ళే. వేరే పిల్లల్ని అడుగుదామంటే అప్పటికే బాగా ఆలస్యం అయిపోయింది. అందుకని చాచానెహ్రూ గురించి తనకు తెలిసిన నాలుగు వాక్యాలే చెబుదామనుకున్నాడు:

"చాచా నెహ్రూ అసలు పేరు జవహర్‌లాల్ నెహ్రూ. ఆయన చాలా గొప్ప నాయకుడు. ఆయన గొప్ప స్వాతంత్ర్య యోధుడు. ఆయనకు పిల్లలంటే చాలా ఇష్టం. అందుకనే ఆయన పుట్టిన రోజును బాలల దినోత్సవంగా జరుపుకుంటున్నాం" అని రాసుకున్నాడు ఓ కాగితం మీద. వాటిని చదువుకుంటే వాడికి చాలా ఉత్సాహం వచ్చింది. నెహ్రూ గురించి తనకు అంతా తెలుసుననిపించింది.

తెల్లారి బడికి వెళ్ళగానే సీనుని అడిగాడు-"నువ్వేం చెబుతావురా, చాచా నెహ్రూ గురించి?" అని.

"చాచా నెహ్రూ భారతదేశపు తొలి ప్రధాని" అన్నాడు వాడు.

"అది నాకు తెల్సు" అన్నాడు రాము బింకంగా.

"చాచానెహ్రూ చాలాసార్లు జైలుకెళ్ళాడు" అన్నాడు సీను.

"ఆ సంగతి ఎవరికి తెలీదు?" అన్నాడు రాము, మనసులోనే ఆ రెండు వాక్యాలనూ గుర్తుంచుకుంటూ.



ఓసారి సీను అటు వెళ్ళగానే తన జేబులోంచి కాగితం తీసి ఆ రెండు అంశాలనూ రాసుకున్నాడు నవ్వుకుంటూ.

ఈ పద్ధతి నచ్చింది వాడికి.

తర్వాత సుజాత చెప్పింది- "నెహ్రూ తల్లిదండ్రులు స్వరూపరాణి, మోతీలాల్" అని.

రోజా చెప్పింది- "నెహ్రూ భార్యపేరు కమలానెహ్రూ" అని.

రాము వీటిని అన్నింటినీ జాగ్రత్తగా రాసిపెట్టుకున్నాడు తన కాగితంలో.

కార్యక్రమంలో ఎవరో మాట్లాడుతూ చెప్పారు- "మన తొలి మహిళా ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ ఎవరో కాదు, నెహ్రూ గారి కుమార్తే!" అని. రాముకి ఆ సంగతి చాలా ముఖ్యమనిపించింది- రాసి పెట్టుకుందామని జేబులోంచి కాగితం తియ్యబోయాడు.

చూస్తే కాగితం లేదక్కడ!

హడావిడిగా జేబులన్నీ తడుముకున్నాడు .

ఉహుఁ..లేదు. ఎక్కడో పడిపోయి ఉండాలి. అన్నివైపులా వెతికాడు రాము. ఎక్కడెక్కడో పడి ఉన్న కాగితాలన్నిటినీ ఏదో ఒక వంకతో విప్పి చూశాడు.. ఎక్కడా కనబడలేదు, తన కాగితం.

అంతలోనే మైకులో ప్రకటన వినవచ్చింది- "ఇప్పుడు రాము చెబుతాడు మనకు- బాలల దినోత్సవం గురించి" అని.

రాము బిక్క మొఖం వేసుకొని స్టేజీ ఎక్కి మైకు ముందు నిలబడ్డాడు. "చాచా నెహ్రూ అసలు పేరు జవహర్‌లాల్ నెహ్రూ...మరే, మరే,..ఆయన చాలా గొప్ప నాయకుడు.."

"చాలాసార్లు జైలుకెళ్ళాడు.." అందించారు ప్రక్కనే కూర్చున్న సోషల్ అయ్యవారు. ఆయనకెట్లా తెలుస్తుంది, సరైన వరస ఏమిటో?

"అవునవును, చాలా సార్లు జైలుకెళ్ళాడు" పూరించాడు రాము, మైకులో.

ఆ తర్వాత వాడికి ఇంక ఏం చెప్పాలో తెలీలేదు. ఎక్కడో వరస తప్పిపోయినట్లుంది- ఇంకేమీ గుర్తుకు రావట్లేదు. నీళ్ళు నములుతూ నిలబడ్డాడు.

"నాకీ అవకాశం ఇచ్చిన మీకందరికీ ధన్యవాదాలు" అందించారు అయ్యవారు, ఇంకేమీ రాలవని గుర్తించి.

రాము ఆ ముక్కనీ అనేశాడు గబగబా. పిల్లలందరూ చప్పట్లు కొట్టారు.

రాము వగర్చుకుంటూ క్రిందికి దిగి ఊపిరి పీల్చుకున్నాడు. గర్వంగా అటూ ఇటూ చూశాడు, కూర్చోబోతూ.

వాడు కూర్చునే చోటనే పడి ఉంది, వాడు రాసుకున్న కాగితం!

వాడు ఓసారి దానికేసి కోపంగా చూసి, గబుక్కున దాని మీద కూర్చున్నాడు.

అటుపైన అరిచాడు అందరితోబాటూ- "భారత్ మాతాకీ..జై!" అని.

బాలల దినోత్సవ శుభాకాంక్షలతో,

కొత్తపల్లి బృందం.




# నీతిచంద్రిక

విగ్రహం-2

*జరిగిన కథ: హంస రాజ్యంనుండి దేశాటనపై వెళ్ళిన కొంగ ఒకటి నెమలి రాజు రాజ్యాన్ని చేరుకున్నది. అక్కడి పక్షులు దాన్ని ఆదరించాయి; తమ రాజ్యమంతా తిప్పి చూపించాయి. అటుపైన 'ఈ రెండు రాజ్యాలనూ పోల్చి ఏది గొప్ప రాజ్యమో చెప్పమ'ని అడిగాయి. కొంగ తన రాజ్యాన్ని గురించి గొప్పలు చెప్పటమే కాక, వాటి ఆ రాజ్యాన్ని చిన్న బుచ్చుతూ మాట్లాడి, అవి కూడా తమ రాజ్యానికి వలస వచ్చి తమ రాజును శరణు వేడాలని హితోపదేశం చేసింది. వెనక్కి వచ్చాక, అప్పుడేం జరిగిందో తమ రాజుకు విన్నవిస్తున్నది. ఇక చదవండి, నీతి చంద్రిక 25 వ భాగం..*

*మూలం: కీ.శే.కందుకూరి వీరేశలింగం* *సరళీకరణ: ఘడియారం వేంకట నారాయణ శర్మ*

రోగంతో ఉన్నవాడికి సరైన ఆహారం రుచించనట్లు, నేను చెప్పిన మంచిమాటలు 'కోపం' అనే వ్యాధికి గురైన ఆ పక్షుల చెవుల్లో పడి అసూయనే పుట్టించాయి. ముఖాలు కోపంతో ముడుచుకు పోగా ఆ పక్షులన్నీ వెటకారంగా నవ్వుతూ, కళ్లతో నిప్పులు చెరుగుతూ, నావైపు అసహ్యంగా చూస్తూ నన్ను, తమరిని చాలా చెడ్డ మాటలన్నాయి.

నిండు సభలో చెప్పదగిన మాటలు కావు, అవి. ఆ కుక్కలు అట్లా మొరిగినంత మాత్రాన తమ గౌరవానికి ఏమీ మచ్చరాదు- ఆ మాటలతో అవి తమ స్వభావాన్నే బయటపెట్టుకున్నాయి.

పాములకు పాలుపోస్తే విషం పెరిగినట్లు, వివేకం లేనివాళ్లకు మంచిమాటలు చెబితే మదం ఎక్కుతుంది. పాములకు ఒకేనోరు గాని, దుర్మార్గులకు నిలువెల్లా విషపు నోర్లే అని పెద్దలు చెబుతారు. అందువల్ల , తెలివి తక్కువ వారికి మంచి చెప్పటంవల్ల నోటిదురద తీరుతుందేమో గానీ, ప్రయోజనం మాత్రం ఏమీ ఉండదు. అలాంటి ఉపదేశాలవల్ల పంతం పెరుగుతుంది తప్పిస్తే, ఇసుమంత మేలుకూడా జరగదు. కాబట్టి తెలివైన వాడు ఎప్పుడైనా వివేకం ఉన్నవాళ్లకే బోధించేందుకు ప్రయత్నించాలి. అలా కానివాడు కొండముచ్చులకు నీతి చెప్పబోయిన కుందేలు మాదిరి తప్పక కష్టాలపాలౌతాడు" అన్నది.

"ఏమా కథ?" అని హంసలరాజు అడిగింది, అప్పుడా కొంగ 'కొండముచ్చులు-కుందేలు' కథను ఇలా చెప్పసాగింది.



మాల్యవంతం దగ్గర ఒక అడవి ఉండేది. ఆ అడవిలోని చెట్ల నుండి మిగులపండిన పండ్లు ఎప్పుడూ వ్రేలాడుతూ కనువిందు చేసేవి. ఎండాకాలంలో ఒకనాటి మధ్యాహ్నం నడినెత్తిన సూర్యుడు ఎండలు మండిస్తుంటే, ఆ అడవిలోని కొండముచ్చులకు బాగా దప్పికైంది. అంతలో వాటికి దూరంగా ఎండమావి ఒకటి కనబడింది.

వేడి వల్ల ఆ ప్రాంతంలో గాలి తరగలు అటూ ఇటూ కదులుతున్నాయి. దానిని చూసిన కొండముచ్చులు అది ఒక 'నదీప్రవాహం' అని భ్రమపడ్డాయి. అవన్నీ అటువైపుగా నడుస్తుంటే, ఎండవేడికి వాటి పాదాలు పాపం, బొబ్బలెక్కాయి. అయినా ఎంత

దూరం పోయినా ఎండమావి ఇంకొంచెం దూరంలో కనిపిస్తూ ఊరిస్తున్నది తప్పిస్తే, ఆ కొండ ముచ్చుల చేతికి మాత్రం అందలేదు. అవి అట్లా చాలా దూరం నడిచీ నడిచీ, ఎక్కడా గుక్కెడు నీళ్లు కూడా దొరక్క పూర్తిగా అలసిపోయాయి. ఆ సమయంలో వాటికి మర్రిచెట్టొకటి కనబడింది. అవన్నీ ఆ చెట్టు నీడకు పరుగులెత్తి, దాని నీడ వల్ల చల్లగా ఉన్న ఇసుక తిన్నెల మీద చేరగిల పడి, తమ బరువును తామే మోయలేమన్నట్లు ఆ మర్రి ఊడలను ఊతగా పట్టుకున్నాయి.



అప్పుడు వాటితో ఒక కొండముచ్చు మిగిలిన వాటితో " చూశారా, మనం ఇప్పుడు ఎంత దూరం వచ్చామో!? మనం ఉండే చోటు నుండి యీ మర్రిచెట్టు ఒక యోజనం దూరంలో ఉంటుందని చెబుతుంటారు పెద్దలు. ఎండదెబ్బకు చాలా అలసిపోయినా, 'నీళ్లు దొరుకుతాయి కదా' అన్న ఆశకొద్దీ "ఇదిగో వచ్చేసింది" "ఇదిగో వచ్చేసింది" అనుకుంటూ ఆశలను తరుముకుంటూ నడిచి వచ్చాము. మనం నడిచిన కొద్దీ నీళ్లు ఇంకా ఇంకా దూరమే ఔతున్నట్లు అనిపిస్తున్నది నాకు. ఇప్పటి మన పరిస్థితి చూస్తే, అడుగు తీసి అడుగు పెట్టేటట్లు లేదు. మిట్టమధ్యాహ్నపు సూర్యుడి వేడికి మన కాళ్లు కాలి చాలా బొబ్బలెక్కాయి. నాలుకలు తడి ఆరి పిడచగడుతున్నాయి. ఇప్పుడు యీ దప్పిక ఎట్లా తీరుతుంది? ఏం చేద్దాం?" అన్నది బాధగా.

ఆ మర్రిచెట్టు తొర్రలో నివసిస్తున్న కుందేలు ఒకటి ఆ మాటలు విన్నది. కొండ ముచ్చుల కష్టాన్ని తలచుకొని దాని మనస్సు కరుణతో నిండిపోయింది. మనసు పట్టలేక , దాని ఖర్మకొద్దీ అది తొర్రలోంచి బయటికి వచ్చి, దాపులనే నిలబడి, చెవులు రిక్కించి అన్నది

"వెర్రి వాళ్లల్లారా! మీరు ఆ ఎండమావులను చూసే కాబోలు, జలాశయాలని భ్రమపడుతున్నారు. వాటితో ఎండతప్ప, ఒక్క నీటి బొట్టుకూడా లేదు. ఇదిగో, ఆ తగ్గులో కొంచెం దూరం వెళ్లారంటే , అక్కడొక సరస్సు కనిపిస్తుంది. పోయి,ఆ నీళ్లు తాగి మీ దాహం తీర్చుకోండి, పొండి" అన్నది.



ఆ మాటలు వినగానే కొండముచ్చొకటి వెటకారంగా నవ్వి మరుక్షణం ప్రళయకాలంలో ఎగసిపడే అగ్నిశిఖ మాదిరి కణకణా మండిపడ్డది. పటపటా పళ్లు కొరుకుతూ, నొసటి మీద ముడతలు భయం గొల్పగా అది ఒక్క ఉదుటున లేచి ఆ కుందేలు మీదికి ఉరికింది. గబుక్కున అది అట్లా లేచేసరికి ఆకాశంలో మిణుగురులు అన్నీ చెల్లా చెదరై పరుగులెత్తాయి. అంతలో ఆ కొండముచ్చు కుందేలు వెనక కాళ్లు రెండింటినీ పట్టుకొని దాన్ని తలక్రిందులుగా పైకెత్తి చూపుతూ - "విన్నారా! పనికిరాని యీ కుందేలు నోరు అరిగి పోయేట్లు మనల్ని ఎన్నెన్ని మాటలన్నదో ! మనందరం వెర్రివాళ్లమట! దానికి ఉన్నంత తెలివి ఉంటేగద, మనకు? మనకు సుద్దులు చెప్పేందుకు అదిగాక ఎవరున్నారు?! చూశారా, దీని పొగరు!" అని వెటకరిస్తూ, మిగిలిన కోతులతో ఆడుతూ , ఎగతాళి చేస్తూ, దయలేనట్లు ఆ కుందేలును గట్టిగా నేలకు విసిరికొట్టి , కాళ్లతో తొక్కి దాన్ని యమసదనానికి పంపింది.

అటుపైన ఆ కొండముచ్చులన్నీ కదిలి, కుందేలు చెప్పిన సరస్సుకు వెళ్లి , కడుపునిండా నీళ్లు త్రాగి, తమకు నచ్చినట్లు పోయాయి.



కాబట్టి, మూర్ఖులకు మంచి మాటలు చెప్పేందుకు అసలు ప్రయత్నించనే కూడదు. అట్లాంటి ప్రయత్నం ఏమైనా చేశామంటే తప్పకుండా కష్టాలు పైన పడతాయి.

సరే , నన్ను ఆ విధంగా తిట్టి, ఆ పక్షులన్నీ నన్ను కళ్లెర్ర జేసి చూస్తూ, రోషంతో కరకుదేలిన మాటలు చాలా మాట్లాడాయి. "ఓరేయ్ ! దుర్మార్గుడా! నీకు మతి చలించింది. అందుకనే మీ రాజు వైభవాన్ని గోరంతలు కొండతలు చేసి చెప్పటం మొదలుపెట్టావు. అంతటితో ఆగక, భయం ఏ మాత్రం లేనట్లు మమ్మల్ని , మాదేశాన్ని కించపరచావు. నీది పాపపు బుద్ధి. దాన్ని పోనిచ్చుకున్నావు గాదు. నీ వాళ్లంకాని మాలాంటి వాళ్లను పట్టుకున్న సహజదోషాలు అసలు ఏనాటికైనా విడిచిపోతాయటరా?

పక్షపాత బుద్ది తో నీ బుర్ర శూన్యం అయిపోయి ఉన్నది. నీ మనసులోని వెలితిని అందరికీ చెప్పి తేటతెల్లం చేసుకున్నావు, అందరికీ గౌరవపాత్రుడైన చిత్రవర్ణుడు నీ కంటికి కూడా ఆనలేదు కదూ! వ్యతిరేక బుద్ధి ఉన్నవాళ్లకు పూజనీయులు కూడా తక్కువగానే తోస్తుంటారు. అనుభవ శూన్యుడివి అవ్వటం చేత, నువ్వు నీకంటే పెద్దవాళ్లను తీసి పారేసి మాట్లాడుతుంటావు.

నీకింత దుష్టత్వం పనికిరాదు. ఆకాశంలో తేలియాడే మబ్బుని చూచి పారిపోయే పిరికితనం హంసలకు సహజం. అలాంటి పిరికిపందనేనా, నువ్వు సిగ్గువిడిచి ఇంతసేపూ "గొప్ప పరాక్రమవంతుడు" అని వర్ణించింది?! అంత పిరికి దానికి రాజ్యాధికారాన్నిచ్చిందెవరు? ఇచ్చినా, అతను ఆ రాజ్యభారాన్ని ఎలా మోస్తున్నాడు?! ఎవరికి ఏ పని చేపట్టే అర్హత ఉందో, వాళ్లే ఆ పనిని చేపట్టాలి. అట్లాకాకపోతే నవ్వులపాలైపోతారు. మబ్బుల్లో నీటిని చూసి , చెరువులో నీళ్లను ఖాళీ చేసుకునేంత తెలివిమంతులు ఇక్కడ ఎవ్వరూ లేరు. మీ రాజులాంటివాళ్లు వెయ్యిమంది కలిసినా మా రాజుకు సాటి రాగలరా? చాలుచాలు! నీ గొప్పలు చెప్పుకోవటం మానెయ్యి. మాకుకాదు; నీకే మేం ఒక హితోపదేశం చేస్తాం. నీతి ఉన్నవాడివైతే మా మాటను విని, ఆ ప్రకారంగా చెయ్యి.

మీ రాజులాంటి వాళ్లను నూరుగురిని కాపాడగల సమర్థత మారాజుకు ఉంది. మా మాటవిని, నువ్వు, మీ రాజు కూడా మా ప్రభువుని ఆశ్రయించుకొని బ్రతకండి"

అని ఆ పక్షులన్నీ తమరిని నిందించేటప్పుడైతే, ఇక నేనేం చెప్పను? నాకు ఆకాశాన్నీ భూమినీ ఒక్క గుక్కలో మింగెయ్యాలన్నంత కోపం వచ్చింది.

అయినప్పటికీ నేను ముందువెనుకలు ఆలోచించి, చేసేదేమీ లేక, ఆ కోపం మొత్తాన్నీ మనస్సులోనే అణచుకొని, పొంగివస్తున్న పరుషపు మాటలు నాలుకదాటకుండా త్రొక్కిపట్టి, కొంత శాంతం అవలంబిస్తూ, మనస్సులో భయపడుతూనే, లేని గాంభీర్యం తెచ్చుకొని అన్నాను- "ఆc ఇవెక్కడి మాటలు!? మీరందరూ కలసి గౌరవంకొద్దీ ప్రార్థించి అడిగినట్లడిగితే , లోక రీతిలో ఏదిమంచిదో దాన్ని, నాకు తోచినట్లు చెప్పాను. మీ మనసుకది నచ్చిచేస్తే మేలు; చేయకపోతే ఇంకా మేలు- అంతేకానీ, ఇంత మాత్రానికే కోపం తెచ్చుకొని, ఇలా పద్ధతి కాని మాటల్ని

నోరు జారనివ్వటం సరైన విధానం తెలిసిన మీలాంటి వారికి ధర్మమో?! మా రాజు గొప్పదనాన్ని వర్ణించేందుకు మీరు ఏపాటి వాళ్లు? అసాధారణమైన గౌరవమూ, ఉదారత్వమూ కల మా రాజుని ఎందుకు , ఇలా నిష్కారణంగా తూలనాడి, లేని పాపం మూట గట్టుకుంటారు? ప్రపంచంలో మంచి వారిని తిట్టటాన్ని మించిన పాపం వేరే ఉంటుందా? వృధాప్రయాస వద్దు - నోటి చేటు ఎందుకు ? నా మాట విని ఇకనైనా మృదుమార్గాన్ని అవలంబించండి. మాటలోని పరుషత్వం ఎంత గొప్పవారికైనా లోకంలో కష్టాలనే తెచ్చిపెడుతుంది. రాళ్లు రువ్వేవాడి పైకి ఎవ్వరూ పూలు విసరరు! కాబట్టి నేను కూడా మిమ్మల్ని ఒక సంగతి అడగవలసి వస్తున్నది - తైతక్కలాడే పిట్టకొకదానికి మీ పక్షిరాజ్యాన్ని యావత్తు కట్టబెట్టిన ఆ తెలివిమంతుడెవరో చెప్పండి ముందు, మరి" అన్నాను.

ఆ-నా మాటలు నోట్లో ఉన్నవి ఉన్నట్లు ఉండగానే వాటిలోని దుష్టకాకి ఒకటి కోపంతో కనుసైగ చేయటం; దాన్ని గ్రహించిన ఆ అడవి పక్షులన్నీ చెలరేగి పోరాటానికి దిగటం జరిగిపోయాయి.



"గౌరవాన్నిచ్చే చోట శాంతము, అగౌరవమైన చోట పరాక్రమము గొప్పవారికి అలంకారం " అని పెద్దలు చెబుతుంటారు కదా; ఆ సంగతి గుర్తు చేసుకొని, నేను కూడా వెనుకంజవేయకుండా యుద్ధానికి సిద్ధపడి నిలిచాను.." అని అది ఇంకా ఏదో చెప్పబోయింది. అంతలో హంసరాజు నవ్వి, ఇలా అన్నది- (తర్వాతి కథ మళ్ళీ...)



# సోమరిపోతు కథ

*"దేవుడు పిశాచాన్ని ఎందుకు పంపించాడు? సోమరికి పని చేసి పెట్టమని. మరి ఒకసారి సోమరితనం వదిలిపోయాక ఇక పిశాచం అక్కడ ఉండి ఏం చేస్తుంది? అందుకని వెళ్ళిపోయిందన్నమాట!"..*

*రచన: పి.మైనా, ఆర్. సౌమ్య, తరుణి స్ఫూర్తి, 5 వ తరగతి, ప్రభుత్వ ప్రాథమిక పాఠశాల, గడ్డంనాగేపల్లి, అనంతపురం జిల్లా*



అనగనగా గడ్డంనాగేపల్లిలో ఒక రైతు ఉండేవాడు. ఆ రైతుకు ఒక కొడుకు ఉండేవాడు. ఆ పిల్లవాడు చాలా సోమరిపోతు. అతనికి ఏ పని చేయడానికీ ఇష్టం లేదు. ఎప్పుడూ నిద్ర పోవాలనుకునేవాడు.

తల్లిదండ్రులు చెప్పిన చిన్న పని చేయడానికి కూడా చాలా మొండికేసేవాడు. ఇంట్లో

వాళ్ళూ, ఊళ్ళో వాళ్ళూ అందరూ అతన్ని సోమరి పోతు అనేవారు. అయినా అతనిలో మార్పు రాలేదు.

ఒక సారి అతడు దేవుణ్ణి ప్రార్థించాడు - తనకు ఒక సేవకుణ్ణి పంపించమని. 'ఈ సోమరిపోతుకు గుణపాఠం చెప్పడానికి ఇదే మంచి సమయం' అనుకున్నాడు దేవుడు. కొంచెం ఆలోచించి, ఒక పిశాచాన్ని అతనికి సేవకుడిగా పంపించాడు.

ఆ రోజు రాత్రి సోమరిపోతు ఇంటికి పిశాచం వచ్చి తలుపు తట్టింది. "అయ్యా! దేవుడు నన్ను మీ సేవకుడిగా ఉండమని పంపాడు. మీరు నాకేమి పని చెబితే ఆ పని చేస్తాను," అని పిశాచం తనని తాను పరిచయం చేసుకున్నది.

మరుసటి రోజు ఉదయం నిద్ర లేస్తూనే సోమరిపోతు సేవకునికి చాలా పనులు చెప్పాడు. రోజూ తల్లిదండ్రులు చెప్పే పనులన్నీ సేవకుడి చేత చేయించాడు. సేవకుడు వాటిని చక చకా చేసేసాడు. ఇంకా ఏం పనులున్నాయని అడిగాడు.

"మా నాన్న ఊరి చివర ఒక గుడిసె కట్టించాడు. దాన్ని శుభ్రం చేసి, అలికి, సున్నం పూసి, ఇంటి చుట్టూ కంచె వేసి, గేటు బిగించి, దాన్ని ఎవరికైనా ఎక్కువ ధరకు అమ్మేసి, డబ్బు తీసుకురా" అన్నాడు. ఆ పనిని కూడా సేవకుడు తొందరగా చేసేసాడు. 'ఇంకేదైనా పని ఇమ్మని' అడిగాడు. "సరే, ఇప్పుడు నువ్వు పోయి మా ఊరి చెరువులో ఉండే మొసలిని చంపేసి రా" అని పని చెప్పాడు. పిశాచానికి ఆ పని ఎంత సేపు? చెప్పీ చెప్పగానే పూర్తి చేసుకొని వచ్చింది.

ఇలా సోమరిపోతు యజమాని ఏ పని చెప్పినా పిశాచ సేవకుడు తొందరగా పూర్తి చేసేసి, 'ఇంకా పని చెప్పండి' అని అడుగుతున్నాడు. సాయంత్రం అయ్యేసరికి పనులు చెప్పడానికి కూడా విసుగేసింది సోమరిపోతుకు. దీని బదులు ఏదైనా పని చేయాలనిపించింది. అంతే- సోమరిపోతుకి పని చేద్దామని అనిపించేసరికి, పిశాచం కాస్తా మాయమైంది.

సోమరిపోతుకు బుద్ధి వచ్చినందుకు అతని తలిదండ్రులే కాదు, దేవుడు కూడా సంతోషించాడు. 



# సీతాకోకచిలుక గర్వం

*సేకరణ: యం. భువనేశ్వరి, 7 వతరగతి, విజ్డమ్‌స్కూల్, గుడిపాల, చిత్తూరుజిల్లా.*

అడవిని ఆనుకొని ఒక గులాబి తోట ఉండేది. అక్కడ ఒక సీతాకోకచిలుక ఉండేది. అది చాలా అందంగా, రకరకాల రంగులతో ఉండేది. దాని రెక్కలు అనేక రంగులతో మెరిసిపోతూ ఉండేవి. అయితే ఆ అందం దానికి ఎక్కడ లేని గర్వాన్ని తెచ్చిపెట్టింది. ఆ గర్వంతో దాని మూర్ఖత్వమూ పెరిగిపోయింది.

ఒక రోజు ఆ తోటలోకి ఒక ఏనుగుపిల్ల వచ్చింది. సీతాకోకచిలుక ఏనుగు చెవి మీద వచ్చి వాలింది.

"ఎవరు నా చెవిమీద ఉన్నది?" అన్నది ఏనుగు.

"నేను ఎవరినో కూడా తెలియదా, నీకు?! నేను దేశ దేశాలకే అందగత్తెను. అందమైన సీతాకోకచిలుకను నేను!" అని సీతాకోకచిలుక బదులిచ్చింది.

అప్పుడు ఏనుగు చాలా సంతోషంగా "ఓ

నువ్వా! నిన్ను కలుసుకోవటం నిజంగా నా అదృష్టం. నిజానికి మన ఇద్దరం ఒకటే: నాకూ తొండం ఉంది; నీకూ తొండం ఉంది. నేనూ శాకాహారినే, నువ్వూ శాకాహారివే. మనం ఎంచక్కా కలిసి మెలసి ఆడుకోవచ్చు ఎప్పుడూ. ఏమంటావు?" అన్నది.

అప్పుడు సీతాకోక చిలుక తన తొండాన్ని అటూ ఇటూ తిప్పుతూ, రెక్కల్ని రెపరెపలాడిస్తూ, చాలా గర్వంగా- "ఏనుగూ, నువ్వెక్కడ? నేనెక్కడ? నేను పువ్వులలోని తేనె త్రాగగలను, గాలిలో ఎగరగలను, నీకంటే ఎంతో అందంగా ఉంటాను. నాతో కలసి ఉండటానికి నీకు ఏం గొప్పతనముందని?" అన్నది.

ఈ మాటలు విని ఏనుగు కోప్పడలేదు. "అవును సీతాకోకచిలుకా, నువ్వు నాకంటే ఎంతో గొప్పదానివి. గొప్ప వాళ్ళతో స్నేహం చేస్తే మంచిది కదా, అందుకనే నేను నీ స్నేహం కోరాను"-అని ఏనుగు అనేసరికి, సీతాకోకచిలుక గర్వం ఇంకా పెరిగిపోయింది.

అంతలో ఉన్నట్టుండి ఒక పెద్దగాలి వచ్చింది. గాలికి తట్టుకోలేక సీతాకోక చిలుక బర్రున కొట్టుకు పోయింది. కొంచెం ఉంటే అది ఎదురుగా ఉన్న ముళ్ళ కంచెలో ఇరుక్కుపోయేదే. అందమైన దాని రెక్కలు చినిగి పీలికలయ్యేవే. భయంతో సీతాకోకచిలుక, "కాపాడండి,కాపాడండి" అని అరవటం, మరుక్షణం ఏనుగు తన తొండంతో దాన్ని పట్టుకొని కాపాడటం- రెండూ ఒకేసారి జరిగాయి.

సీతాకోకచిలుకకు తన పరిమితులు తెలిసాయి. బుద్ధి వచ్చింది. ఇక మీద ఎప్పుడూ తన అందాన్ని గర్వంగా మార్చుకోకూడదని అనుకుంది. ఏనుగుతో స్నేహం చేసింది. అటుపైన ఏనుగు, సీతాకోక చిలుక రెండూ సంతోషంగా రకరకాల ఆటలాడుకున్నాయి.





# గాడిద తన్నులు

*రచన: ఎస్. మౌనిక, 8 వ తరగతి, జి.ప. ఉన్నత పాఠశాల, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా*

అనగనగా ఒక అవ్వ ఉండేది. ఆ అవ్వకు ఒక మనవరాలు. ఆ పాపకు ఒక రోజు పాయసం తినాలనిపించింది. వెంటనే అవ్వ దగ్గరకెళ్ళి, "అవ్వా! అవ్వా! నాకు పాయసం తినాలనుంది. పాయసం చెయ్యవా!" అని అడిగితే, "అయ్యో! మనింట్లో పాయసం చేసేకి కట్టెలు లేవే! నీవు అడవికెళ్ళి కట్టెలు తేపో, నీకు పాయసం చేసి పెడతాను!" అని అవ్వ చెప్పింది. పాప అడవికి వెళ్ళింది. ఒక చెట్టు మీదికెక్కి ఎండు కొమ్మలు కొట్టుకుంటా ఉంది.

అదే సమయానికి, వాళ్ళ ఊళ్ళో గాడిద ఒకటి తప్పించుకొని వచ్చి అడవిలో మేస్తా ఉంది. అంతలో ఒక నక్క అక్కడికి వచ్చింది. దానికి చాలా ఆకలిగా ఉంది. "నా అడవిలోకొచ్చి మేస్తున్నావా! నిన్ను ఇప్పుడే తినేస్తాను చూసుకో!" అని నక్క గాడిదతో అనింది.

గాడిద కొంచెం ఆలోచించి, "దానిదేముందిలే నక్క బావా! నువ్వు నన్ను తింటానంటే ఎంత భాగ్యం! అయితే నేను ఇప్పుడు బాగా మేత మేసి ఉన్నాను కదా, చాలా బలంగా ఉన్నాను. మరి, నువ్వేమో చాలా ఆకలితో, బలహీనంగా ఉన్నావు. అందుకని, మొదట నువ్వు నన్ను మూడు తన్నులు తన్నావంటే నా బలం పోతుంది. ఆ తర్వాత నేను నిన్ను మూడు తన్నులు తంతాను. దాంతో నీకు ఆకలి బాగా పెరుగుతుంది. అప్పుడు నువ్వు నన్ను తిన్నావంటే చాలా బాగుంటుంది" అని నక్కతో చెప్పింది.

తెలివి తక్కువ నక్క సంతోషంగా సరేనన్నది.

అనుకున్న ప్రకారమే ముందు నక్క గాడిదను మూడు తన్నులు తన్నింది. గాడిద ఒంటి ముందు నక్క శరీరం ఏపాటిది? గాడిదకు ఏమాత్రం దెబ్బ తగల్లేదు.

అటుపైన "నన్ను నువ్వు మూడు తన్నులు తన్నేశావు గదా! నా బలం అంతా తగ్గిపోయింది. ఇప్పుడు నేను నిన్ను తన్నాలి, నీ ఆకలి పెరిగేందుకు" అని గాడిద వెనక్కి తిరిగింది.

"వెనక్కెందుకు తిరుగుతున్నావు?" అని నక్క అనేంతలోనే గాడిద తన వెనక కాళ్ళతో ఒక్క తన్ను తన్నేసరికి, నక్క చాలా దూరం ఎగిరి పడింది. "ఇంకా రెండు ఉన్నాయి ఆగు" అని గాడిద వెళ్ళి రెండో తన్ను తన్నింది. ఆ తన్నుకి నక్కకి నక్షత్రాలు కనిపించాయి. అంతలో గాడిద పరుగెత్తుకొచ్చి మూడో తన్ను తన్నేసరికి, నక్క ఎగిరి వెళ్ళి పాప ఉండే చెట్టుకాడ పడి మూలగటం మొదలు పెట్టింది. ఇక నక్క భయం లేదని, గాడిద అక్కడే హాయిగా మేసుకుంటూ ఉండింది.

ఇక అక్కడ చెట్టు కింద కూర్చొని నక్క మూలుక్కుంటూ, "గాడిద నన్ను మొదటి సారి ఇక్కడ తన్నింది, రెండో సారి ఇక్కడ తన్నిందే . . . " అని లెక్క పెట్టుకుంటూ ఉంటే, చెట్టుపైనున్న పాప విని పకపక నవ్వింది.

అప్పుడు నక్కకి చాలా అవమానం అయ్యింది. అది పళ్ళు బయటపెట్టి పాపని బెదిరిస్తూ "ఈ విషయం గానీ నువ్వు ఊర్లో ఎవరికైనా చెప్పావంటే, నిన్ను చంపి తినేస్తాను-

చూస్తాండు" అని బెదిరించి అక్కడి నుండి వెళ్ళిపోయింది.

పాప కట్టెలతో ఇల్లు చేరుకుంది. అవ్వ పాయసం చేస్తా ఉంటే పాప మాత్రం దిగులుగా కూర్చుంది. అవ్వ పాయసం ఇస్తే తాగింది గానీ పాప ముఖంలో సంతోషం లేదు. పాపను చూసి అవ్వ "ఎందుకమ్మా అంత దిగులుగా ఉన్నావు?" అని అడిగింది. అవ్వ ఎన్ని సార్లు అడిగినా బదులివ్వలేదు. "పాపా! నీకు పావలా ఇస్తాను, చెప్పు . . . అర్ధ రూపాయి ఇస్తాను, చెప్పు . . . రూపాయి ఇస్తాను , చెప్పు . . . రెండు రూపాయలు ఇస్తాను, చెప్పు " అని అవ్వ బతిమాలేసరికి, పాప జరిగిందంతా చెప్పేసింది.

అది విన్న అవ్వ కూడా పకపకమని గట్టిగా నవ్వింది. ఆ నవ్వు విని ఊర్లో ఉన్న వాళ్ళంతా వచ్చి 'ఏమయిందవ్వా' అని అడిగితే విషయం మొత్తం చెప్పేసింది అవ్వ!

తనకు జరిగిన అవమానం గురించి ఊర్లో వాళ్ళందరికీ తెలిసి పోయిందని ఇప్పుడు నక్కకు తెలిసిపోయింది. దానికి ఇప్పుడు పాపమీద విపరీతమైన కోపం వచ్చేసింది. "నేను చెప్పొద్దంటే అందరికీ ఎందుకు చెప్పాలి?" అని, అది ఆ రోజు రాత్రి పాప ఇంటికి వచ్చింది.

నక్క వచ్చే సమయానికి పాప ఒక మంచం మీద పడుకొని ఉంది; ప్రక్కనే అవ్వ ఇంకో మంచం మీద పడుకొని ఉంది. నక్క ఏమాత్రం అలికిడి చెయ్యకుండా, పాప పడుకున్న మంచాన్ని ఎత్తుకొని అడవి వైపు పోతా ఉంది. కొంచెం దూరం పోయాక పాపకు మెలకువ వచ్చింది. ప్రక్కన చూసుకుంటే అవ్వ లేదు! వెంటనే పాపకు విషయం అర్థమయిపోయింది.

ఏం చెయ్యాలి అని ఒక్క నిముషం ఆలోచించి "అబ్బో! ఎన్ని గాడిదలున్నాయో ఇక్కడ!" అని గట్టిగా అరిచింది తెలివైన ఆ పాప. అది విని, మంచాన్ని క్రింద పడేసి, నక్క పరుగో పరుగు!





# చేయగలం

రచన: ఆర్.చంద్రశేఖర్,10 వతరగతి, నందన గ్రామీణ పాఠశాల, చౌడవరం, గుంటూరు.

కొత్తపల్లిలో చంద్రశేఖర్, రాకేష్ అనే ఇద్దరు స్నేహితులు ఉండేవాళ్ళు. వాళ్ళిద్దరూ ఎప్పుడూ కలిసి ఆడుకునేవాళ్ళు. అయినా వాళ్ళిద్దరి మనస్తత్వాలూ చాలా భిన్నంగా ఉండేవి. ఏ పనైనా సరే, చెయ్యాలంటే చాలు- రాకేశ్‌కు వెయ్యి ఆలోచనలు మొదలయ్యేవి. ఇంకా మొదలైనా పెట్టకుండానే 'ఆ పని అవుతుందా, కాదా' అని గబగబా ఆలోచించేసేవాడు; వెంటనే 'అవ్వదు' అని తేల్చేసేవాడు కూడా. చంద్రశేఖర్‌దేమో పోటీ తత్వం. ఎవరైనా 'పని అవ్వదు' అన్నారంటే చాలు- 'అవుతుంది' అని చేసి చూపించే రకం.

కొత్తపల్లిలో పెద్దకొండ ఉంది కదా, ఆ కొండమీద రకరకాల పండ్ల చెట్లు ఉంటాయి. ఒకసారి వేసవికాలం వచ్చింది. పిల్లలందరూ రోజూ కొండ ఎక్కేందుకు పోతున్నారు. చంద్రశేఖర్, రాకేష్‌తో అన్నాడు. "ఒరేయ్!

కొండ మీద చాలా మామిడి చెట్లు ఉన్నాయి కదా! వేసవికాలం వచ్చింది. మామిడి చెట్లకి బాగా మామిడికాయలు కాసాయట; అందరూ చెప్పుకుంటున్నారు. రోజూ ఎవరెవరో కొండనెక్కి మామిడి కాయలు కోసుకొచ్చుకుంటున్నారు. మనంకూడా వెళ్ళి తెచ్చుకుందాం పా!" అని.

రాకేశ్ అన్నాడు "ఒరేయ్! కొంచెం తెలివిగా ఆలోచించు. ఊరికే ఎందుకు, శ్రమ పడతావు? రోజూ ఎందరెందరో పిల్లలు వెళ్ళి మామిడికాయలు కోసుకొచ్చుకున్నారు. ఇప్పుడు అక్కడ ఒక్క కాయకూడా ఉండదు. మనం ఎక్కి ప్రయోజనం ఉండదు. ఇంక, మన కాళ్ళు చూడు- ఎంత బలహీనంగా ఉన్నాయో! మనకు కొండ ఎక్కటమే రాదు అసలు. ఒకవేళ మనం కష్టపడి కొండ ఎక్కినా, దిగటం రాక అవస్థల పాలవుతాం. అందుకని ఇదంతా మానెయ్. కావాలంటే ఎవరినైనా అడిగి కొన్ని కాయలు తెచ్చిపెట్టమందాం" అని.

చంద్రశేఖర్ ఎంత చెప్పినా వినలేదు రాకేశ్. అయితే అదే సమయానికి రాకేశ్ వాళ్ల మామయ్య ఒకాయన ఊరినుండి వచ్చి, సంగతంతా విన్నాడు. "మీరైనా చెప్పండంకుల్! ఏం చేద్దామన్నా వీడు అడ్డమే చెబుతుంటాడు ఎప్పుడూ" ఫిర్యాదు చేశాడు చంద్రశేఖర్. "వాడు అంతగా చెబుతున్నాడుగా , పోయి చూడరాదురా, రాకేశ్!" అని మామయ్యకూడా అన్నాక, రాకేశ్ అయిష్టంగానే బయలు దేరాడు.

ఇద్దరూ కలసి కొండ ఎక్కటం ప్రారంభించారు . సగం కొండ ఎక్కగానే రాకేష్‌కు కాళ్ళ నొప్పులు మొదలయ్యాయి.

"ఒరేయ్! కొండ మీద మామిడి కాయలు ఉన్నాయో , లేవో? మనకి తెలీదు కదా?! నువ్వేమో 'బాగా కాసాయి' అంటున్నావు. నీ మాటలు నేను ఎలా నమ్మను? నాకు కాళ్ళు విరిగిపోతున్నాయి. నేను ఇంక నడవలేను బాబూ" అంటూ అక్కడే ఒక చెట్టుకి చేరగిల బడ్డాడు రాకేశ్.

సరిగ్గా అదే సమయానికి నాగుబాబు వాళ్ళిద్దరినీ దాటుకొని పోతున్నాడు. వాడు

కూడా వీళ్ళిద్దరి తరగతే. బక్కగా, పీలగా, బలహీనంగా ఉండే నాగుబాబంటే తరగతిలో అందరికీ అలుసే. "ఒరేయ్! నాగూ! ఎటురా, పోతున్నావ్!" పిలిచాడు చంద్రశేఖర్.

నాగుబాబు వీళ్ళని చూడనట్టే పోతున్నాడు "నులగక్క ఎనునే..నులగక్క ఎనునే" అని ఏదోమంత్రం చదువుకుంటూ.

"ఒరేయ్! ఎటురా?" అని మళ్ళీ కేక వేసిన మీదట, వాడన్నాడు "పైకి..నులగక్క ఎనునే.." అని. "నువ్వు పైకె ఎక్కుతున్నావా? నీకు అంతబలం ఎక్కడినుండి వచ్చింది?" అడిగాడు రాకేశ్.

వాడు ఒకసారి ఆగి, "మీ మామయ్యే కద, నాకు ఈ మంత్రం చెప్పింది! లేకపోతే నేను ఇంత పైకి ఎలా ఎక్కాననుకుంటున్నావు?..నులగక్క ఎనునే " అన్నాడు.

రాకేశ్ ముఖం ఒక్కసారిగా విప్పారింది. "ఆగురా, నేనూ వస్తాను. మామయ్యకు మంత్రాలు వచ్చని నాకు చెప్పనే లేదు. ఏంటా మంత్రం?.. నులగక్క ఎనునే" అంటూ తనూ లేచి నాగు వెంట పరుగెత్తాడు.

అటుపైన వాళ్ళు ముగ్గురూ మంత్రం చదువుకుంటూ చాలా సులభంగా కొండనెక్కేశారు!

చూడగా అక్కడ చెట్లకి చాలా కాయలు ఉన్నై. ముగ్గురూ కలిసి సంతోషంగా తమకు తోచినన్ని కాయలు కోసుకొని తిన్నారు. ఇంకొన్ని కాయల్ని మూటగట్టుకున్నారు; ఇంటికి తెచ్చుకునేందుకు.

"కొండ దిగటం చాలా కష్టంరా! మోకాళ్ళు నొప్పులు పుడతాయి. నేను దిగలేను అనిపిస్తున్నది. ఇక్కడే కూర్చుంటాను" అన్నాడు రాకేశ్, సరిగ్గా దిగే సమయానికి.

"మామయ్య దానికీ ఒక మంత్రం చెప్పాడురా- 'నునే గది నులగ'- ఒక నూట పదహారు సార్లు జపించేసరికి దిగేస్తాం అన్నాడు. రా, ఇంక" అని బయలు దేరాడు నాగ.

చూస్తూండగానే మిత్రులు ముగ్గురూ కొండ దిగేశారు.

"మంత్రాలు భలే పని చేశాయి నీకు మంత్రాలు

వచ్చుని నాకు చెప్పనే లేదేమి, మామయ్యా?" అడిగాడు రాకేశ్, మామయ్యని చూడగానే.

మామయ్య నవ్వి, "దానిదేముందిరా, మీరూ చెయ్యచ్చు మంత్రాలు- ఏ పనికైనా పనికొచ్చే మంత్రం ఒకటి ఉన్నది నా దగ్గర- చెప్పనా?" అన్నాడు.

చంద్రశేఖర్ అరిచాడు- "నాకు తెలుసు మామయ్యా! నేను చెబుతాను- 'నునే యచే నులగ!' అంతేనా?" అని.

మంత్రాల్లో కిటుకు అర్థమైన రాకేశ్, నాగలు కూడా నవ్వారు.

మామయ్య వాళ్ళని మెచ్చుకుని చెప్పాడు- "అంతేరా! "నేను చేయ గలను" అని అనుకుంటే మనం దేన్నైనా సాధిస్తాం. అవసరమైతే దాన్నే మార్చి 'నునే యచే నులగ' అని మంత్రంగా చేసుకోవచ్చు!" అన్నాడు నవ్వుతూ.

అటుపైన రాకేశ్ ఈ మంత్రాన్ని బాగా వాడినట్లున్నాడు; వాడిలో ఎంత మార్పు వచ్చిందో చెప్పలేం! అప్పటినుండి కొత్తపల్లి బడి పిల్లలంతా ఏ పని చెప్పినా 'మేము చేయగలం' అంటూ ఆ పనిని పూర్తి చేసేస్తున్నారు!



**కథ విప్పండి!**

1. దేహమంతా కళ్ళు ఉండును కాని దేవేంద్రుడిని గాను. నరుడి తోడు లేక నడువలేను నేను ప్రాణిని కాను. పట్టి ప్రాణాలు తీస్తాను. నేనెవరిని నేనెవరిని?

2. చల్లని బంతి తెల్లని బంతి అందని బంతి ఏమిటది?

*సేకరణ: ప్రమీల, మూడవ తరగతి, చెన్నేకొత్తపల్లి.* *(జవాబులు: 43వ పేజీలో...)*



# మనసు మార్చిన దొంగ

*రచన: 6, 7, 8, తరగతుల పిల్లలు, అభ్యాసవిద్యాలయం, విజయవాడ.*

అనగా అనగా సీతాపురంలో పవన్ అనే ఒక అల్లరి పిల్లవాడు ఉండేవాడు. వాడి అల్లరికి అంతు ఉండేది కాదు.సైకిల్ తొక్కుతూ చిన్న పిల్లల్ని భయపెట్టేవాడు,అందరినీ కొట్టేవాడు, స్కూలు ఎగ్గొట్టి రోడ్డు మీద గోలీలు ఆడేవాడు. తోటల్లో జామకాయలు దొంగతనం చేసేవాడు.

ఒక రోజు వాడు దొంగతనం చేస్తూ, తోటమాలికి దొరికిపోయాడు. తోట మాలి వాడిని పట్టుకొని బాగా కొట్టాడు. ఆ రోజు నుంచి పవన్ ఇంకా మొద్దు బారిపోయాడు- మరిన్ని దొంగ పనులు చేయటం మొదలుపెట్టాడు.

ఇలా వాడు దొంగిలించిన వస్తువులు, డబ్బులు అన్నిటినీ వాడు చెరువు గట్టున ఒక చెట్టు క్రింద గుంత తవ్వి పాతిపెట్టేవాడు.

కొత్తగా తెచ్చుకున్న వాటిని పాతిపెడుతున్న ప్రతిసారీ తన సంపద మొత్తాన్నీ ఒకసారి చూసుకొని మురిసిపోయేవాడు.

ఒక రోజు అలా దొంగ సొత్తును పాతిపెట్టుతున్న పవన్ మెడకు చల్లగా ఏదో తగిలింది..చూడగా అది ఒక కత్తి! బుర్ర మీసాలు పెట్టుకొని, కండలు తిరిగిన గజదొంగ ఒకడు వాడి వెనకాలే నిలబడి ఉన్నాడు.



"మర్యాదగా ఆ డబ్బంతా ఇచ్చేయ్" అన్నాడు దొంగ.

పవన్ భయంతో వనణికి పోతూ తన డబ్బును, సామాన్లను అన్నిటినీ దొంగ కాళ్ళ ముందు పడేశాడు.

"ఒరేయి పిల్లాడా ఇవన్నీ నీకెక్కడివి? ఇంత డబ్బు ఉందంటే నువ్వు కూడా నాలాగే దొంగవి అయ్యుండాలి. నేను ఇప్పటికే ఐదు సార్లు జైలుకు వెళ్ళాను, ఈ సారి నువ్వు కూడా వస్తావా, నాతో?" అడిగాడు దొంగ, మెడ మీద కత్తిని మెల్లగా జరుపుతూ.

పవన్ నోట్లోంచి ఒక్క మాట కూడా రాలేదు. "బె...బె....బె....బె.." అని మాత్రం అనగలిగాడు.

దొంగ గట్టిగా నవ్వుతూ "ఒరేయ్! చిన్న దొంగ సొమ్ము పెద్ద దొంగ పాలు. ఇక మీద నువ్వు దోచినదంతా నాదే! హ హ్హాహ్హాహ్హా " అన్నాడు సామాన్లు మూట కట్టుకుంటూ.

పవన్ బిత్తర పోయి చూస్తుంటే దొంగవాడు వెనక్కి తిరిగి "ఒరేయ్! నా మాట విను.

దొంగ బతుక్కి అర్థం లేదు. నువ్వు కూడా నాలాగా తయారవ్వకు. నువ్వు బాగుపడనంత వరకూ నేను మాత్రం నిన్ను వదలను- నీ దొంగ సొమ్ము అంతా నాదే! -గుర్తుంచుకో !" అని నవ్వుతూ వెళ్లి పోయాడు.

ఆ తరువాత పవన్ దొంగతనాలు మానేశాడు. బడికి వెళ్ళటంకూడా మొదలు పెట్టాడు. క్రమంగా వాడు చాలా మంచివాడు అయ్యాడు.

పవన్‌ను మార్చడం కోసం దొంగ వేషంలో వచ్చిన తోటమాలి వాడిలోని మార్పుకు చాలా సంతోషించాడు.

**కథ విప్పండి!**

3. జీడివారి కోడలు,సిరగల వారికి ఆడపడుచు వయసులో కులికే వయ్యారి వైశాఖ మాసరిలో వస్తుంది. ఏమిటది?

4. గూటిలో ఉంటాము గువ్వలం కాము, చుట్టూ కాపలా ఉంటుంది కాని రాజులు కాము,న్యాయధర్మాలు తెలిసినా న్యాయమూర్తులం కాము, ఎవరు మేము ఎవరు?

5. సన్నని దంతాలున్నాయి కాని ఎలుకను కాను, కుచ్చుతోక నాకున్నది కాని నక్కను కాను, చేసితిని శ్రీరామునికి సాయం కానీ కోతిని కాను మరినేనెవరిని?

*సేకరణ: ప్రమీల, రామచంద్ర, 3వతరగతి, చెన్నేకొత్తపల్లి.* *(జవాబులు: 43వపేజీలో..)*



# రోడ్డుపైన ధర్మం

*చిన్న కథే; కథనమూ ఏమంత గొప్పగా లేదు..కానీ చివర్లో వాడిన పెద్ద వాక్యాలు మా మనసుల్ని కదిలించాయి.. చదివి మీకెలా అనిపించిందో చెప్పండి...*
*కొత్తగూడెంలో నవంబరు 2010 లో జరిగిన 'బాలోత్సవం' సీనియర్స్ విభాగంలో మొదటి బహుమతి పొందింది ఈ కథ- రచన: ఆర్.సాయికుమారి, 9 వ తరగతి, త్రివేణిస్కూలు, కొత్తగూడెం.*

ఒకానొక ఊరిలో ఒక కుటుంబం. ఆకుటుంబం చాలా బీద కుటుంబం. రాజయ్య చెప్పు లు కుట్టుకుంటూ కుటుంబాన్ని పోషించేవాడు. వాళ్ల పిల్లలు- సరళ, రాజు- ఇద్దరూ చాలా చురుకైనవాళ్లు. కానీ పేదరికం మూలాన, వాళ్ళిద్దరికీ చదువుకొనేందుకు వీలయ్యేది కాదు. రోజూ కూలికి పోవలసి వచ్చేది.

ఒకరోజు ఆ ఇద్దరు పిల్లలు, "నాన్నా! మన కుటుంబం ఇట్లా ఉండటానికి కారణం ఏమిటి? మన జీవితాలు ఎందుకిలా ఉన్నాయి? మేము ఎందుకు చదువుకోవటం

లేదు?" అని బాధగా అడిగారు రాజయ్యను. అతను ఏం సమాధానం చెప్పగలడు?

కొన్ని రోజులు గడిచాయి. వాళ్ళ కుటుంబం మరిన్ని కష్టాలలో కూరుకు పోయింది. అనారోగ్యం పాలై రాజయ్య అకస్మాత్తుగా మరణించాడు. ఇప్పుడు కుటుంబాన్ని పోషించే దిక్కు కూడా లేదు. "అమ్మ ఒక్కతే మనల్ని ఎలా పోషిస్తుంది?" అన్న ప్రశ్నలు మొదలయ్యాయి ఆ పిల్లలిద్దరి మనసులో.

అలాంటి సమయంలో ఒకసారి, గాంధీ జయంతి రోజున, ఆ అక్కా తమ్ముళ్లిద్దరూ రోడ్డు మీద నడిచి వెళ్తుంటే అక్కడి స్కూలు ఒక దానిలో పిల్లలు ఏదో నాటకం వేస్తుండటం కనబడింది. ఆ నాటకంలో ఒక పిల్లవాడు తెల్లగా మెరిసే పెయింటు పూసుకొని గాంధీగారి వేషం వేసుకొని కనబడ్డాడు వాళ్లకు. వాళ్ళిద్దరూ కొంతసేపు అక్కడే నిలబడి నాటకం చూశారు.

తర్వాత వెనక్కి వస్తూ రాజు అన్నాడు అక్కతో- "అక్కా! నాకొక ఆలోచన వచ్చింది. ఇప్పుడు ఆ అబ్బాయి గాంధీ వేషం వేస్తున్నాడు కదా. నేను అదే వేషం వేసుకొని రోడ్డు మీద నిల్చుంటాననుకో, అటూ-ఇటూ వెళ్ళేవాళ్ళు ఎవరైనా డబ్బులు వేస్తారు- అలా అమ్మకు సహాయం చేసినట్లూ ఉంటుంది; మిగిలిన డబ్బుతో మనం చదువుకోవచ్చేమో కూడాను" అని.

"అట్లా చేయడం తప్పు కదురా?! అమ్మ ఒప్పుకోదేమో" అన్నది సరళ.

"అది తప్పు ఎందుకు అవుతుందక్కా? మనం ఏమీ దొంగపనులు చెయ్యం కద!" అన్నాడు రాజు.

ఇద్దరూ తమ పథకాన్ని అమ్మకు చెప్పి, ఒప్పించారు . "నా పిల్లలకు ఇలాంటి పరిస్థితి రావడం ఏంటి?" అని చాలా బాధపడింది వాళ్ళమ్మ. కానీ, పరిస్థితులు అలా ఉన్నాయి- ఆమె ఏమీ అనలేకపోయింది.

ఆనాటినుండీ రాజు రోజూ గాంధీగారి వేషం వేస్తున్నాడు. సరళ వాడికి మేకప్పు చెయ్యటంతోపాటు పాటలు పాడటం, కంజీర, ఢోలక్‌లు వాయించటం చేసేది. రోడ్డుమీద అటూ ఇటూ వెళ్ళేవాళ్ళు వాళ్లని

చూసి జాలిపడి ఏవో కాసిని పైసలు ఇచ్చేవాళ్ళు. అట్లా వాళ్ళిద్దరికీ రోజూ కొంత డబ్బు చేతికి రావటం మొదలెట్టింది.



కష్టాలు మూకుమ్మడిగా వస్తాయన్నట్లు, వాళ్ళ అమ్మ కూడా అకస్మాత్తుగా చనిపోయింది. ఇద్దరూ అనాధలయ్యారు- కానీ అప్పటికే గాంధీగారి వేషంలో నిలదొక్కుకున్న పిల్లలిద్దరూ అదే పనిని కొనసాగించారు- రోజూ ఒక పూట బడికి వెళ్ళటం, మరో పూట రోడ్డున పడి, వేషం వెయ్యటం. మొదట్లో బడికి సక్రమంగా రావట్లేదని టీచర్లు వాళ్లని మందలించేవాళ్ళు. కానీ కొన్ని రోజులకు వాళ్ల పరిస్థితిని తెలుసుకున్నాక ఏమీ అనకుండా ఊరుకున్నారు.

వాళ్ల బడిలోనే 'చింటు' అనే కుర్రాడు ఒకడు ఉండేవాడు. వాడు రోజూ రాజుని ఏడిపించేవాడు- "నువ్వేంటి? ఇలా ఒంటినిండా కలర్ పూసుకొని, చేతిలో కర్ర పట్టుకుని అడుక్కుంటున్నావు?" అని. సరళ చేతిలో డబ్బులు లాక్కునేవాడు వాడు; కానీ అటుగా వెళ్తున్న పెద్దవాళ్ళుకాని, పిల్లలు కాని- ఎవ్వరూ వాడిని ఏమీ అనేవాళ్ళు కాదు. 'ఎవరైనా వచ్చి రక్షిస్తారేమో' అని కొంతకాలం ఎదురు చూశాక, రాజు సరళలు పరిస్థితిని తమ అదుపులోకి తీసుకోవటం నేర్చుకున్నారు. ఇద్దరూ కలిసి ధైర్యంగా పోరాడే సరికి చింటూ వాళ్ళ జోలికి రావటం మానేశాడు.

బాగా చదువుకున్న రాజు సరళలు ఇద్దరూ తాము పోగుచేసుకున్న డబ్బుతో

లాయర్లయ్యారు. అనేక సాంఘిక సంక్షేమ కార్యక్రమాలు చేపట్టారు. 'రోడ్డు మీద అడుక్కున్న పిల్లలు లాయర్లవుదామని ఎందుకు అనుకున్నారు?' అని అందరూ ఆశ్చర్యపోయారు. దానికి వాళ్ళిచ్చిన సమాధానం- "ధర్మం రోడ్డున పడినప్పుడు ఎవ్వరూ పట్టించుకోలేదు- దాని మానాన అది తన్నుకులాడి ధర్మం చివరికి ఎలాగో నిలబడింది. అందుకని, ఇప్పుడిక మా వంతు కృషి చేస్తాం. మాలాగా ధర్మాన్ని రోడ్డు మీద నిలబెట్టి ఇక ఎవ్వరూ గొప్పవాళ్ళవ్వనవసరం ఉండదు. ఇప్పుడిక ఏ పిల్లవాడూ రోడ్డున పడకుండా చూస్తాం. ధర్మాన్ని కాపాడుతాం!" అని.

పేదరికపు కష్టాలనుండి పైకి ఎదిగిన వాళ్ళు తమ మూలాలని మరువకపోతే ఎంత మందికి ఆసరా అవ్వగలరో చూపిన సరళ, రాజు నిజంగా ధన్యజీవులు.

## కోయిల కూస్తే ఆరోగ్యం

కవిత

కోయిల కూస్తే వసంతం వస్తుంది
వసంతం రావాలంటే చెట్లు పెంచాలి
మొక్కలు నాటాలి
చెట్లు నరికేస్తే వానలు పడవు
వానలు పడకపోతే పంటలు పండవు
పంటలు పండకపోతే ఆహారం ఉండదు
ఆహారం ఉండకపోతే మనిషి అనారోగ్యంగా ఉంటాడు
అందుకే..
కోయిల కూస్తే ఆరోగ్యంగా ఉంటాం!

*రచన: కె.హరికృష్ణ, 6B, ప్రభుత్వ ఉన్నత పాఠశాల, టెక్కలి, శ్రీకాకుళం జిల్లా*



# పిశాచాల సహాయం

*రచన: టి. నాగమణి, 8 వతరగతి, జి.ప. ఉన్నతపాఠశాల, పోలేపల్లి, అనంతపురంజిల్లా*

రామాపురంలో రంగడు అనే పిల్లవాడు ఉండేవాడు. వాళ్ల అమ్మ సుగుణమ్మ; నాన్న రామప్ప. వాళ్ళు చాలా పేదవాళ్ళు. అయినా రంగడికి ఏ పనీ చేతకాదు. 'ఎందుకూ పనికి రావురా' అని రామప్ప ఎప్పుడూ తిడుతూ ఉండేవాడు వాడిని. ఊళ్ళో వాళ్ళంతా 'బద్ధకపు మొద్దు' అని ఎగతాళి చేసే వాళ్ళు. కానీ రంగడు ఎవరినీ పట్టించుకునే వాడు కాదు. జులాయిలాగా ఎప్పుడూ ఊరంతా తిరుగుతూ ఉండేవాడు.

కొన్నాళ్ళకి రామప్ప మరణించాడు. సుగుణమ్మ కూలి పనికి వెళ్ళడం మొదలు పెట్టింది. అయితే రంగడిని పోషించడం ఆమెకు పెద్ద కష్టమై పోయింది. వాడికి ఏ పనీ ఇష్టం లేదు; చేతకాదు; పని చేస్తానని వెళ్ళినా ఎవ్వరూ వాడికి పని ఇచ్చేవాళ్ళు కాదు! చిన్నప్పటి నుండీ తను ఏ పనీ చేయలేదు-

అసలు ఎప్పుడైనా ఏదైనా చేస్తే కదా, పనులు వచ్చేది?

ఊళ్ళో రంగడి మేనమామ రామాంజన్నకి చాలా పనులొచ్చు. అతని దగ్గరకి వెళ్ళి ఏదైనా పని నేర్చుకోమని సుగుణమ్మ ఎంత చెప్పినా వీడు మాత్రం ఒప్పుకోడు! ఒకరోజు సుగుణమ్మ కి కోపం చాలా వచ్చేసింది: "ఇక నిన్ను పోషించడం నా చేత కాదు, ఇల్లు వదిలి వెళ్ళిపో- అంతే!" అన్నది.

అకస్మాత్తుగా రంగడికి చాలా అవమానం అనిపించింది. 'తల్లే కాదన్నాక, ఇంక ఇక్కడ ఉండేది ఎందుకు? ఎక్కడికైనా వెళ్ళిపోతాను' అని ఇల్లు వదలి బయలు దేరాడు. వాడు అట్లా దిగులుగా పోతూ ఉండగా దగ్గర్లోనే ఒక చింతతోపు కనిపించింది. వాడు అక్కడే బావిలో నీళ్ళు తాగి, ఒక చెట్టు కింద, బండ మీద- కూర్చున్నాడు.

సరిగ్గా వాడు కూర్చున్న చెట్టు మీదే రెండు పిశాచాలు కూర్చొని ఉన్నాయి. రంగడిని చూడగానే అవి లొట్టలేసుకుంటూ క్రిందికి దిగాయి. రంగడు వాటిని చూసాడుగానీ ఏమీ పట్టించుకోలేదు. భయం కంటే వాడికి బద్ధకమే ఎక్కువైంది మరి! వాడి మొహంలో దిగులూ అట్లాగే ఉంది. కొంచెం సేపు వాడి చుట్టూ తిరిగి సంతోషంగా నాట్యం చేసిన పిశాచాలు కూడా చివరికి వాడి మొహం వైపు చూసి జాలితో నీరు కారి పోయాయి.



"ఏం బాబూ! ఎందుకు, అట్లా దిగులుగా ఉన్నావు?" అని అడిగాయి ఆ పిశాచాలు. అప్పుడు రంగడు "పిశాచాలూ, నాకు ఏ పని చేయడమూ చేత కాదు. 'పోనీలే, పని చేద్దాం' అని వెళ్తే కూడా నాకు ఎవ్వరూ పని ఇవ్వటం లేదు. పనికి మాలిన వాడినని ఇంట్లో అమ్మ తిడుతుంది; ఊళ్ళో వాళ్ళు ఎగతాళి చేస్తున్నారు. నేనేం చేయాలో నాకు అర్థం

కావడం లేదు. అదే నా దిగులు" అని చెప్పాడు.

"ఓహ్హోహ్హో పిచ్చివాడా! ఇంతేనా!" అని పకపకా నవ్వాయి పిశాచాలు. రంగడికి చాలా కోపం వచ్చింది. వాడి ముఖాన్ని చూడగానే వెంటనే నవ్వటం ఆపేసి, పిశాచాలు "సరే! అయితే నువ్వు మా వెంటరా! నిన్ను మంచి పనివంతునిగా మారుస్తాము!" అన్నాయి.

బద్ధకపు రంగడికి వెంటనే అమ్మ గుర్తుకి వచ్చింది. తను అమ్మ అనుమతి తీసుకొని రాలేదనీ గుర్తుకొచ్చింది. దాంతో "నేను మా అమ్మనడిగి వస్తాను" అన్నాడు వాడు. అయితే అక్కడున్నవి దయ్యాలు గద- ఊరుకుంటాయా? "అమ్మ సంగతి తరువాత చూద్దాం, ముందు నువ్వు వస్తావా? రావా?" అని అవి వాడిని బలంతంగా లాక్కెళ్ళాయి.

కొంచెం సేపు ముళ్ళ దారుల్లో నడిపించాక, అవి వాడిని ఒక పొలం ముందు నిలబెట్టాయి. అక్కడ గుబురు చెట్ల నుండి భయంకరమైన శబ్దాలు చాలా వస్తున్నాయి. అప్పటికి గానీ రంగడికి భయం మొదలవ్వలేదు. పిశాచాలు వాడికి ధైర్యం చెబుతున్నట్లు- "నువ్వు భయపడకు- నిన్ను మేము ఏమీ చెయ్యం! ఏ పనీ రాని నీలాంటి అమాయకుణ్ని తింటే మాకే పాపం! కాబట్టి నిన్ను మేం ఏమీ చెయ్యం. మేమే కాదు, ఇక్కడ చెట్టు మీద ఉన్నవన్నీ చాలా మంచి పిశాచాలే. అవన్నీ నిన్ను చూసేశాయి. వాటికి చాలా పనులొచ్చు. అవన్నీ నీకు ఆ పనులన్నీ నేర్పిస్తాయి. బుద్ధిగా నేర్చుకో. ఏమంటే అవన్నీ మా అంత మెతకగా ఉండకపోవచ్చు. కొన్నిటికి కోపం జాస్తి. చెప్పిన పని చేయకపోతే అవి నిన్ను తినేయచ్చు కూడా. అయితే బుద్ధిగా పని నేర్చుకున్నంత కాలం నీకేం కాదు" అన్నాయి.

రంగడు పొలంకేసి చూశాడు. ఆ పొలంలోనాలుగైదు పిశాచాలు చాలా చక్కగా పనులు చేసుకుంటున్నాయి- సరిగ్గా మనుషుల లాగానే! అంతలోనే రంగడికి తనని ఎవరో పిలిచినట్టు అనిపించింది. చూడగా అది ఎవరోకాదు- పనులు చేసుకుంటున్న పిశాచాలలో ఒకటి! రంగడు భయపడుతూ భయపడుతూ వెళ్ళాడు దాని దగ్గరికి.

అయితే ఆ పిశాచం చాలా మంచిగా మాట్లాడింది. ఎంతో ప్రేమగా పని ఎలాచేయాలో నేర్పడం మొదలుపెట్టింది రంగడికి.

పిశాచాల మాటని కాదనేది ఏముంది? రంగడు రెండో రోజుకల్లా రక రకాల పనులు నేర్చేసుకున్నాడు. ఇంకో రెండు రోజులకల్లా 'నేనూ పనులు చేయగలను' అని నమ్మకం కలిగింది వాడికి. ఆ సరికి వాడు పొలం పనులు చాలా వరకు నేర్చేసుకున్నాడు.

ఐదో రోజున రెండు క్రొత్త పిశాచాలు వచ్చి రంగడిని పరీక్షించాయి. ఒకసారి వాడికి పనులన్నీ వచ్చునని నమ్మకం కుదిరాక, వాటి అనుమతి తీసుకొని, రెండు పిశాచాలు రంగడిని నడిపించుకొచ్చి ఊర్లో వదిలాయి. వాడు పిశాచాలకు కృతజ్ఞతలు చెబుదామని వెనక్కి తిరిగి చూసేటప్పటికి అవి అక్కడ లేవు!

ఇంటికి తిరిగొచ్చిన రంగడిని చూసి సుగుణమ్మకు సంతోషంతో కళ్ల నీళ్ళు వచ్చాయి. వాడు "అమ్మా! నాకిప్పుడు చాలా పనులొచ్చమ్మా! నేనింక బాగా పని చేస్తాను. నిన్ను బాగా చూసుకుంటానమ్మా!" అంటుంటే అమ్మకు పట్టరాని ఆనందం కలిగింది.

మరునాడు సుగుణమ్మ వాడిని రామాంజన్న దగ్గరికి తీసుకెళ్ళింది. రంగడికి ఇప్పుడు అన్ని పనులూ వచ్చని చెప్పి, ఏదైనా పని ఇమ్మని బ్రతిమాలింది. రామాంజన్నకు అంతగా ఇష్టం లేకపోయినా, 'సరే చూద్దాం'అని వాడికి పని ఇచ్చాడు.

ఇంకేముంది? రంగడు ఇప్పుడు తనకు ఇచ్చిన పనులన్నీ చకచకా చేసేయటం మొదలు పెట్టాడు. "సేద్యం పనులు కావాలంటే రంగడి చేతనే చేయించుకోవాలి- వాడు పనులు ఎంత చక్కగా చేస్తాడో!" అని రామాంజన్న ఊళ్ళో వాళ్ళందరికీ చెప్పసాగాడు. అప్పటి నుంచి ఊళ్ళో వాళ్ళంతా రంగడిని గౌరవించారు. సుగుణమ్మ వాడిలోని మార్పును చూసి మురిసిపోయింది.

కొన్నేళ్ళ తర్వాతగానీ రంగడికి తెలీలేదు - 'తనకి పనులు నేర్పిన పిశాచాలు నిజానికి

పిశాచాలు కావు, మనుషులే! అదంతా అమ్మ, రామాంజి మామ కలిసి ఆడించిన నాటకం!' అని. 'రంగడిని వెతుక్కుంటూ పోయిన రామాంజి మామ నలుగురైదుగురు పని మనుషుల్ని పురమాయించి, ఆ నాటకం ఆడించాడు. నాటకం చివరలో వచ్చిన క్రొత్త దయ్యాలు వేరెవరో కాదు- సుగుణమ్మ, రామాంజిమామలే!

ఇప్పుడు పెద్దయిన తర్వాత, రంగడు ఈ సంగతిని ఇంకా తన పెళ్ళాం పిల్లలకు చెప్పుకొని నవ్వుతూనే ఉన్నాడు! 

జోకులు

**తిరగదిప్పు మంత్రం!**

టీచర్: రెండు ఏళ్లు ఎంత?

రాము: ఉం.. ఉం...14

టీచర్: వెరీ గుడ్! మరి ఏడు రెళ్ళు?

రాము: నాకు ఆ మాత్రం తెలీదనుకున్నారా, 41!

**మీరే గొప్ప!**

టీచర్: పార్వతీ నిన్ను ఒక ప్రశ్న అడుగుతానమ్మా, బాగా ఆలోచించి సమాధానం చెప్పు!

పార్వతి: అడగండి టీచర్!

టీచర్: మీ అమ్మ గొప్పదా, మీ టీచర్ గొప్పదా?

పార్వతి (కొంచెం సేపు ఆలోచించి): మా టీచరే గొప్పది.

టీచర్: చక్కగా చెప్పావు. మరి టీచర్‌లో గొప్ప ఏంటో అదికూడా చెప్పమ్మా.

పార్వతీ: మా ఇంట్లో అమ్మ జోలపాట పాడితే నేను ఒక్కదాన్నే నిద్రపోతాను. మరి బళ్ళో మీరు పాఠాలు చెప్పినప్పుడైతే పిల్లలంతా నిద్రపోతారు. అందుకని మీరే గొప్ప టీచర్!

*సేకరణ: సి.మమత, 9వతరగతి, జిల్లాపరిషత్‌హైస్కూల్, వెంకటంపల్లి.*




# స్పేస్‌షిప్ కుందేలు

*రచన: కె.ఎస్.వి. అనన్య, 6 వతరగతి, రాధాస్కూల్ ఆఫ్ లర్నింగ్, అనంతపురం.*

నక్క: నమస్కారం, కుందేలు బావా.

కుందేలు: నమస్కారం జిత్తులమారి నక్కగారూ.

నక్క: ఏం చేస్తున్నావు?

కుందేలు: నేను క్యారెట్ల కోసం వెతుకుతున్నాను.

నక్క: ఓహో!

కుందేలు: మరి నువ్వు ఏమి చేస్తున్నావు?

నక్క: నా స్నేహితుడైన పులికోసం వెతుకుతున్నాను.

కుందేలు: అవునా! ఇందాకే దాన్ని ఇక్కడికి దగ్గర్లోచూశాను. ఈ పాటికి అది తన గుహకి చేరుకొని ఉంటుంది. త్వరగా వెళ్ళు.

నక్క: టాటా కుందేలూ!

కుందేలు: టాటా నక్కగారూ!

(కొంచెంసేపటికి)

నక్క: అయ్యో నా స్నేహితుడు కనిపించటంలేదే! ఎక్కడికి వెళ్ళి ఉంటుంది? ఎందుకు వెళ్ళి ఉంటుంది?

(అంతలో) పులి: హై! నేను వచ్చేసాను!

నక్క: అయ్యో! ఎక్కడ ఉన్నావు? నేను నీ కోసం ఉదయం నుండి వెతుకుతున్నాను.

పులి: నేను నా ఆహారం వెతుక్కునేందుకు వెళ్ళాను.

నక్క: అయితే సరే మిత్రమా, నేను నీకు మంచి కుందేలును ఆహారంగా చూపిస్తాను- వస్తావా?!

పులి: అయ్యో! ప్రస్తుతం నా కడుపు నిండుగా ఉంది. రేపు ఉదయాన్నే వెళ్దాంలే. సరేనా?

మరునాడు ఉదయం:

పులి: కుందేలును తినేందుకు వెళ్దామా?

నక్క: సరే.

(కుందేలు దగ్గరకు వెళ్ళి..)

నక్క,పులి: శుభోదయం కుందేలు మిత్రమా.

కుందేలు: శుభోదయం.

నక్క, పులి: నీకు ఒక మంచి సమాచారం.

కుందేలు : (లోపల)మళ్ళీ ఏదో పథకం వేసినట్లున్నారు.

(పైకి)ఏమిటది?

నక్క, పులి: తాటి చెట్టు దగ్గర క్యారెట్లు భలే ఉన్నాయి. తెలుసా!

కుందేలు: (లోపల) ఓహో, అదన్నమాట, వీటి పథకం!




(పైకి) సరే అక్కడికి వెళ్దాం గానీ, ముందు నేనూ మీకో మంచి కబురు చెప్పాలి.

నక్క, పులి: ఏంటది?

కుందేలు: మన ఊళ్ళో రాకెట్ ప్రయోగ కేంద్రం ఉంది తెలుసు గదా?

నక్క, పులి: అవును, అయితేనేమి?

కుందేలు: మీరెప్పుడైనా చంద్రుడిని చూశారా?

నక్క, పులి: మాకు చంద్రుడంటే ఏమంత ఇష్టం లేదు.

కుందేలు: అయ్యో! అదేకదా, మీ మూర్ఖత్వం? ఓసారి చూడండి చంద్రుడి మీద- మీకు రెండు కుందేళ్ళు కనబడతాయి. నిజానికి చంద్రుడు తెల్లగా ఎందుకు ఉన్నాడనుకుంటున్నారు? అదంతా కుందేళ్ల రాజ్యమే. అక్కడ ఉన్నన్ని కుందేళ్ళు ఈ భూగ్రహం మీద కూడా లేవు.

నక్క, పులి: అవునా?

కుందేలు: కాకపోతే నేనెందుకు చెబుతాను? వినండి. రేపు ఉదయం ఇక్కడినుండి స్పేస్ షిప్ ఒకటి అక్కడికి వెళ్తున్నదట. దానిలో మా మిత్రుడొక కుందేలు వెళ్తోంది. మీకు ఇష్టమైతే మీరూ అందులో వెళ్ళేట్లు ఏర్పాటు చేస్తానన్నది. చెప్పండి మరి, మీకు ఇష్టమేనా? అక్కడైతే మీకు తోచినన్ని కుందేళ్లను తిని, మళ్ళీ అదే స్పేస్ షిప్ లో వెనక్కి రావచ్చు.

నక్క, పులి:(సంబరపడుతూ) ఇదేదో పిచ్చి కుందేలు లాగా ఉంది. ఇందులో మోసం ఏమీ లేదు గద?! సరేలే, దానిదేముంది, ఇది మనల్నిప్పుడు మోసం చేసినా మళ్ళీ దొరుకుతుందిగా, మా చేతికి?

(పైకి) ఓహో కుందేలూ! అసలైన మిత్రుడివంటే నువ్వే! రేపు మేం నువ్వు కోరినట్లుగా చంద్రుడిమీదికి వెళ్ళొస్తాం.

కుందేలు: సరే సరే! అయితే రేపు రెడీగా రండి మరి!

మరునాడు స్పేస్ షిప్‌లో నక్కి కూర్చున్నై, నక్క, పులి. వాటిని అందులో ఎక్కించిన కుందేలు ఎటు పోయిందో మరి, పోయింది.

నక్క: పులీ! నీ గొంతు మరీ పెద్దది. అస్సలు మాట్లాడకు!

పులి: సరేలే! ఎక్కువ మాట్లాడకు నువ్వూనూ. మనం బయట పడితే కష్టమే.

వీళ్ళు మధ్యలోనే దింపేస్తారు మనల్ని.

(రాకెట్ పైకి వెళ్తున్నకొద్దీ వాతావరణంలో ఆక్సిజన్ తగ్గిపోసాగింది. స్పేస్ షిప్ లో ఉన్న మనుషులు ఆక్సిజన్ మాస్కులు వేసుకొని హాయిగా ఉన్నారు. దొంగతనంగా ప్రయాణిస్తున్న పులి,నక్క మాత్రం ఊపిరాడక చచ్చిపోయాయి)

నక్క పులి: అయ్యో! అయ్యో! ఊపిరి! ఆడట్లేదు! అయ్యో! ఎందుకు? ఏమైంది?

వాటిని పైకి పంపించిన కుందేలు అటుపైన హాయిగా బ్రతికింది.

జోకులు

**గేదెల తప్పు!**

మేనేజర్: గేదెలకోసం లోన్ తీసుకొని ఇంత వరకూ ఇన్ స్టాల్ మెంట్స్ కట్టలేదే?

నారాయణ: ఇంకా నా గేదెలు పాలివ్వడం లేదయ్యా, నేనేం చెయ్యను?!

**చలి పులి!**

తల్లి: ఏమ్మా మాలినీ! నువ్వు మొక్కలకు నీళ్ళు పోస్తున్నప్పటి నుండి మొక్కలు ఎండిపోతున్నాయి?

మాలిని: ఏమోనమ్మా, నాకూ అర్థం కావట్లేదు. చలికాలమని వేడినీళ్లుకూడా పోస్తున్నాను చివరికి.

*సేకరణ: సి.మమత, 9వతరగతి, జిల్లాపరిషత్‌హైస్కూల్, వెంకటాంపల్లి.*



# రత్నహారపు సమస్య

*నిజంగా ఇలాంటి సమస్య వస్తే ఎలా పరిష్కారం అవుతుందో తెలీదు గానీ, పుణ్యవతి రాసిన పరిష్కారం మాత్రం చదివేందుకు చాలా బావుంది. మీరూ చదివి చెప్పండి..*



*సేకరణ: పుణ్యవతి, 5 వ తరగతి, ప్రతిభ మోడల్ స్కూల్, జహీరాబాద్.*

*సౌజన్యం: జహీరాబాద్ పిల్లల కథలు, 'మనలైబ్రరీ'*

ఒక రాజుకు కలలో దేవుడు ప్రత్యక్షమై ఒక రత్నాన్ని బహూకరించాడు.

దానికి రెండు వైపులా రంధ్రాలు ఉన్నాయి. దాన్ని హారంలో వేసుకొని ధరించాలనిపించింది రాజుకు.

ఆస్థాన కంసాలిని పిలిచి "మంచి హారంలోకి ఎక్కించండి దీన్ని" అని ఆదేశించాడు.

మరుదినం కంసాలి వచ్చి "మహారాజా! ఎంత ప్రయత్నించినా బంగారు తీగ రత్నం గుండా దూరటం లేదు. రత్నానికి రంధ్రం సరిగా

ఉన్నట్లు లేదు- మధ్యలోనే అడ్డుకుంటున్నది. పోనీ, 'దారాన్ని ఇంకొంచెం సన్నం చేద్దామా' అంటే, అది ఇప్పటికే చాలా సన్నం అయిపోయిందాయె!" అన్నాడు.

దాంతో రాజు దేశ దేశాల స్వర్ణకారులను పిలిపించాడు. అయినా ఫలితం లేదు- ఆ రత్నంలోంచి దూరేంత సన్నటి దారాన్ని ఎవ్వరూ చెయ్యలేకపోయారు.

అదే దేశంలోని తెలివైన యువకుడు ఒకడు ఒకసారి రాజువద్దకు వచ్చి, "నేను ప్రయత్నించి చూస్తాను" అన్నాడు.

"చూద్దువు గాని, అయినా ఇంతమంది దగ్గర లేనిది, నీ దగ్గర ఉన్నది ఏమిటి? అదీగాక మీది స్వర్ణకార కుటుంబం కూడా కాదాయె!" అన్నాడు రాజు.

"తెలివి, పట్టుదల- ఈ రెండూ ఉన్నె నాలో. అయినా ప్రయత్నిస్తే తప్పేముంది?" అన్నాడు యువకుడు. రాజు సంతోషించాడు. "నువ్వేకాదు, ఆ పని ఎవరు చేసినా వాళ్లకు మంచి బహుమతి ఇస్తాను" అన్నాడు.

కంసాలి తయారుచేసిన బంగారుతీగనే తీసుకున్న యువకుడు, ముందు ఒకరోజంతా ఆ రత్నంతో కుస్తీపట్టాడు- అయినా ఏమీ లాభం లేదు- రత్నపు రంధ్రంలోకి నిజంగానే దూరటంలేదు దారం. "రత్నం చాలా గట్టి వస్తువు- దాని బెజ్జాన్ని పెద్దది చేయగల వస్తువు ఏదైనా కావాలి.. అది రత్నం కంటే గట్టిది అయి ఉండాలి.."

కొంత సేపటికి అతనికి ఓ ఆలోచన వచ్చింది. "ప్రభూ! నాకు కొద్దిగా తేనె ఇప్పించండి. దానితోబాటు ఒక రోజు సమయం దయ చేయించండి" అని అడిగాడు. రాజుగారు సరేనన్నారు.

మరునాడు తెల్లవారే సరికల్లా రత్న హారాన్ని తీసుకువచ్చి రాజుకి అందజేశాడు యువకుడు! హారంలో రత్నం చక్కగా అమరి ఉన్నది! రాజు ఆనందానికి హద్దులు లేవు.

"భళా! ఎందరో గొప్ప స్వర్ణకారుల వల్ల కాని పని నీవల్ల అయింది. ఎట్లా చేశావు?" అని అడిగాడు యువకుడిని, నిండు సభలో సన్మానిస్తూ.

"మహారాజా! రకరకాలుగా ప్రయత్నించి విఫలమయ్యాక, ఇక ఆ పని మానవమాత్రుల వల్ల సాధ్యమయ్యేది కాదని అర్థం అయ్యింది నాకు. అందుకని ఆ బంగారు తీగను తేనెలో ముంచి, రత్నపు బెజ్జంలో అది దూరినంత వరకు దూర్చి, గదిలో మూలగా- ఒక చీమల పుట్టకు ఎదురుగా- పెట్టాను. కొంచెం సేపటికల్లా తేనె వాసన పట్టి, చీమలు రత్నంలోకి రాసాగాయి. నేను రత్నాన్ని కదలకుండా ఇరికించి పెట్టాను; అలాగే తీగ రత్నంలోంచి జారిపోకుండా జాగ్రత్త పడ్డాను. అంతే, తెల్లారే సరికి చీమలు తీగను బెజ్జంగుండా రెండోవైపుకు లాక్కెళ్ళాయి! మరి అవి రత్నపు బెజ్జాన్నే పెద్దగా చేశాయో, లేక తీగను సన్నగా చేశాయో మరి, తెలీదు. ఇది నా గొప్పతనం కాదు. ఆ చిన్న చీమలు చేసిన ఘనకార్యం ఇది" అని జవాబిచ్చాడు.

అది విని సభలోని వారంతా హర్షధ్వానాలు చేశారు. రాజు ఆ యువకుడిని ఘనంగా సత్కరించటంతో పాటు, అతన్ని తన ఆంతరంగిక సలహాదారుగా నియమించుకున్నాడు.



## కథ విప్పండి!

6. పదములారు కలవు బంభరంబు కాదు, తొండం ఉంది గాని దోమ కాదు, రెక్కలుండు గాని పక్షి కానేరదు- అయితే మరేమిటి?

7. కాను(?) మీద మాను కడు రమ్యమై యుండు- మాను మీద లతలు మలయుచుండు- లతల మీద వేళ్ళు నాట్యమాడు- నేనెవరిని?

*సేకరణ: రామచంద్ర, 3వ తరగతి, చెన్నేకొత్తపల్లి.* *(జవాబులు: 43వ పేజీలో..)*

## నోటి దుర్వాసన ఎట్లా వదిలింది?

(గతమాసం తరువాయి..)

అనురాగ్ గోదావరి, ఆరవ తరగతి















# బొమ్మకు కథ రాయండి

*నిర్వహణ: శ్రీమతిజి. లలిత*, telugu4kids.com

ఈ బొమ్మను చూడండి:




పాపం.. ఎవరో మెట్ల మీద పడిపోయి ఉన్నారు.

ఎందుకో, మరి ఆ కథ ఏమిటో?!

ఈ సమస్యను పరిష్కరించాల్సిన తెలివైన పోలీసు అధికారి మీరే..

ఆ వివరాలన్నీ చక్కని కథలాగా మాకు రాసి పంపండి. బాగుంటే రెండు నెలల తర్వాత మీ కథని కొత్తపల్లిలో ప్రచురిస్తాం.

మా చిరునామా: కొత్తపల్లి బృందం, యం.ఆర్.వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా-515 101, ఫోన్లు: 08559 240222, 7702877670

**కథ విప్పండి! (జవాబులు)**

1. వల 2. చందమామ 3. మామిడిపండు 4. కళ్ళు
5. ఉడత 6. ఈగ 7. వీణ



# సొరంగం

*కొత్తపల్లి పత్రిక అక్టోబరు 2011 సంచికలో 'బొమ్మకు కథ రాయండి' శీర్షికకు స్పందన, ఈ కథ.*

*రచన: నారాయణ, కొత్తపల్లి బృందం*

"ఒరేయ్, రాజూ! హంపీకి వెళ్తున్నారు కదూ, మీ బడి పిల్లలందరూ? ఇంతకీ మీకు హంపీగురించి ఏమైనా తెలుసా అసలు?" అడిగాడు తాతయ్య, రాజువాళ్ళు ఇంకాసేపట్లో బయలుదేరుతారనగా.

"అబ్బ ! తెలుసులే తాతయ్యా! మా టీచర్ గారు అన్నీ చెప్పారు" విసుక్కున్నాడు రాజు.

"కృష్ణదేవ రాయలవారి సమయంలో హంపీ వీధుల్లో రత్నమాణిక్యాలు కుప్పలుగా పోసి అమ్మేవాళ్ళుట, తెలుసా, అంత సంపద ఉండేది అక్కడ" చెప్పాడు తాతయ్య.

"నాకు తెలుసులే తాతయ్యా, మా టీచర్ చెప్పింది" అసహనంగా కదిలాడు రాజు. తాతయ్య కొనసాగించాడు-"ఆగరా, మీకు

తెలీని సంగతీ వస్తోంది" అంటూ.

"అయితే కృష్ణదేవరాయల తర్వాత విజయనగర సామ్రాజ్యం నశించిపోయింది. చివరికి అది బహమనీ సుల్తానుల వశం అయ్యింది. ఆ సమయంలో డబ్బులున్నవాళ్ళు వాటిని జాగ్రత్తగా దాచి పెట్టుకునేందుకు నానా తిప్పలూ పడ్డారు. ఎవరికి వాళ్ళు బంగారాన్ని, రత్నాలను, వజ్రాలనూ తమకు తోచిన చోట్ల త్రవ్వి దాచుకున్నారు. వాటిలో అధికభాగం అక్కడే ఉండిపోయింది. ఇప్పటికీ అదృష్టవంతులకి ఆ నిధులు దొరుకుతూనే ఉన్నాయి!"

"హంపీలోనా! నిధులా!!" ఉత్సాహంగా అరిచారు రాజు స్నేహితులు ముగ్గురు- సంజయ్, సతీష్, రిత్విక్ . "ఎక్కడ దొరుకుతై తాతయ్యా, అవి ఎక్కడుంటాయో తెలిసేదెలాగ?" అడిగాడు సంజయ్, కళ్ళజోడును ముక్కుపైకి నెట్టుకుంటూ.

"ఏమోరా, ఏ గుహల్లోనో, సొరంగాల్లోనో, గోతుల్లోనో, భూగృహాల్లోనో ఉంటాయేమో.. పెద్ద పెద్ద భవనాల అడుగున కూడా ఉండచ్చు. మనకెలా తెలుస్తుంది?" అన్నాడు తాతయ్య.

"నువ్వు రారాదు, తాతయ్యా! కనీసం ఒక నిధైనా వెతికి పెడుదువు?" అన్నాడు రిత్విక్, తాతయ్యకు దగ్గరగా జరిగి.

"భూమిలోపల దొరికే సంపద మొత్తం ప్రభుత్వానికేరా, చెందేది. నిధులను ఎవ్వరూ సొంతానికి అట్టే పెట్టుకోకూడదు" అన్నాడు తాతయ్య.

అంతలో బడి టీచరుగారు విజిల్ ఊదారు. పిల్లలందరూ తాతయ్యకు వీడ్కోలు చెప్పి బస్సు దగ్గరికి నడిచారు.

******

హంపీ మామూలుగా చాలా వేడి ప్రదేశం. అయితే కొన్నాళ్ళుగా వానలు పడుతున్నట్లున్నాయి; పచ్చటి గడ్డి పరచుకొని ఉన్నది కొండల్లో అంతటా . మధ్యాహ్నం భోజనాలు కాగానే చుట్టు ప్రక్కల ప్రాంతాన్ని అలాగ చుట్టి వచ్చేందుకు పిల్లలకు కాస్తంత సమయం చిక్కింది. ఇంకేముంది, రాజు, సతీష్, సంజయ్, రిత్విక్- నలుగురూ బయలు దేరారు. అంగళ్ళు దాటుకొని,

వరాహ స్వామి గుడి వెనకగా, ముళ్ళ పొదల్ని తప్పించుకుంటూ, కాలిబాట వెంబడి గబగబా నడుస్తూ పోయారు- ఓ చిట్టికొండను ఎక్కుకుంటూ.

"ఒరేయ్, చూస్తూంటే ఈ దారిన చాలామంది నడుస్తూ ఉన్నట్లున్నదిరా, ఇక్కడేమీ నిధులు ఉండవు" అన్నాడు రిత్విక్ నిరాశ పడుతున్నట్లు.

"ఎక్కడైనా ఉండచ్చురా, అవి- అటు చూడు- ఆ ఎలుక? ఎంత పెద్దగా ఉందో చూశావా? అది ఒక నిధికి కాపలా కాస్తూ ఉండచ్చు- ఎవ్వరూ ఇంతవరకూ గమనించి ఉండక పోవచ్చు-" అన్నాడు సతీష్, ఆ ప్రక్కనే ఓ పెద్ద బండ చాటున నిక్కినిక్కి చూస్తున్న ఒక ఎలుకను చూపిస్తూ.

పిల్లలంతా దానికేసి చూశారు. ఆ ఎలుకకూడా కొంచెం సేపు వీళ్లకేసే చూసింది, కళ్ళార్పకుండా. "ఒరేయ్! ఎట్లా చూస్తోందో చూడండ్రా, ఇది? నిజంగానే నిధిని కాపలా కాస్తున్నట్లుంది" అన్నాడు సతీష్, పెదిమలు కదిపీ కదపకుండా. రిత్విక్ నవ్వాడు, కానీ రాజు, సంజయ్‌లు మాత్రం ఆ ఎలుకను పట్టుకోవటంకోసం ముందుకు దూకారు.

వీళ్ళు అటు కదలగానే ఎలుక బండ వెనగ్గా మాయమైంది. రాజు సంజయ్‌లు ఆ పెద్ద బండను ప్రక్కకు నెట్టటంలో మునిగారు. కొంచెం సేపు చూశాక సతీష్, రిత్విక్ కూడా వాళ్లకు సాయం వెళ్ళారు.



మెల్ల మెల్లగా బండ ప్రక్కకు జరిగింది- వెంటనే ఓ నాలుగు ఎలుకలు హడావిడిగా బయటికి పరుగెత్తాయి. అయితే పిల్లలు నలుగురూ నోళ్ళు వెళ్ళబెట్టి చూస్తున్నది ఆ ఎలుకల్ని కాదు! బండరాయి వెనకగా ఉన్నది-

ఒక సొరంగం!

పిల్లలు నలుగురూ బాగా వెనక్కి జరిగి

చూశారు. చిన్నపాటి గుహలాగా ఉన్నదా సొరంగం. లోపలంతా చీకటి- ఏమున్నదో తెలీటం లేదు. కానీ లోపలికి చాలా దూరమే పోతున్నట్లుంది అది.

రిత్విక్ దానిముందు నిలబడి "ఓయ్!" అని అరిచాడు. "ఓ..య్.." అని మెల్లగా వినబడింది ప్రతిధ్వని. కొంచెంసేపు అందరూ దాని ముందు నిలబడి "ఓయ్..ఓయ్.." అని అరిచారు ఉత్సాహంగా.

"లోపలికి వెళ్ళి చూద్దాంరా!" అన్నాడు రాజు మెల్లగా. "చూద్దాం..రా!" అన్నది సొరంగం, కొంచెం ఆలస్యంగా.

నలుగురూ ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

"మాట్లాడే సొరంగం!" అన్నాడు సతీష్ గుసగుసగా.

సొరంగంలోంచి గుసగుసలు వినబడ్డాయి.

"నిధి!" అన్నాడు సంజయ్ ఆగలేనట్లు.

"..ధి!"అన్నది సొరంగం.

"వద్దులేరా, నాకు భయంగా ఉంది. వెనక్కి వెళ్ళిపోదాం. లోపల ఏమున్నాయో, ఏమో. పాములుండచ్చు; గబ్బిలాలు; భూతాలేమైనా.. " ఆగిపోయి గుటకలు మింగాడు రిత్విక్.

మిగిలిన ముగ్గురూ ఒకళ్ల మొహాలొకళ్ళు చూసుకున్నారు.



రాజు అందరికంటే ముందు వంగి సొరంగం లోపలికి దూరాడు. సొరంగంలో నడిచేంత ఎత్తు లేదు. సంజయ్, సురేష్, రిత్విక్‌లు రాజుని అనుసరించారు, ఒకళ్ళ చొక్కాలొకళ్ళు పట్టుకొని, తడుముకుంటూ, నాలుగు కాళ్ళమీద పాక్కుంటూ.

సొరంగం నిజంగానే బాగా పెద్దది. చుట్టూ చిమ్మ చీకటి. ఏమీ కనబడటంలేదుగానీ, నేల

శుభ్రంగానే ఉన్నట్లుంది. అక్కడక్కడా గోడలకున్న చిన్న చిన్న అరలు చేతికి తగుల్తున్నాయి.

నలుగురూ సారంగం ఎన్ని మెలికలు తిరిగితే అన్ని మెలికలు తిరుక్కుంటూ పోతున్నారు. "ఎక్కడా బూజుకూడా లేదేమి?" అని ఆలోచిస్తూ పోతున్న రాజు చేతికి ఒక అరలో అగ్గిపెట్టె ఒకటి దొరికింది. "ఏయ్! ఆగండి! ఇక్కడో అగ్గిపెట్టె ఉంది!" మెల్లగా అరిచి చెప్పాడు రాజు.

అగ్గిపుల్ల వెలుగులో అందరూ ముందుకు చూశారు. సారంగం ఇంకా ముందుకి పోయి, అకస్మాత్తుగా క్రిందికి వాలి ఉన్నది. "ఇక్కడ జాగ్రత్తగా ఉండాలి. ముందు ఏదోగుంత ఉన్నట్లుంది" అన్నాడు సంజయ్, "రాయలవారి కాలంలో అగ్గిపెట్టెలు ఉండేవా, రాజూ?" అని గుసగుసగా అడుగుతూ.

"ఏమో, మనమైతే ముందుకే పోతున్నాం. జాగ్రత్తగా రండి. అగ్గిపుల్లల్ని వృధా చేసేందుకు లేదు" అని రాజు ముందుకు పాకాడు ఇంకా.

నిజానికి వాళ్ళు ముందున్నది గుంత కాదు- మెట్లు!

ఇప్పుడు వాళ్ళు నలుగురూమెట్లు దిగి, లేచి నిలబడ్డారు. అడుగులో అడుగులు వేసుకుంటూ ముందుకు పోయారు. అంతలో సారంగం ఒక పెద్ద భూగృహంలోకి తెరుచుకున్నది! చూసేందుకు అదేదో పెద్ద సభాగృహం లాగా ఉన్నది. పైన ఎక్కడినుండోవెలుతురు ప్రసరిస్తున్నది దాని మధ్యభాగాన. ఆ సభాగృహం చుట్టూతా పెట్టి ఉన్న ఇత్తడి భోషాణాలు మసక వెలుతురులో మెరుస్తూ కనబడుతున్నాయి. వీళ్లంతా ఆ సభాగృహానికి ఒక మూలన నిలబడి అద్భుతంగా చూస్తున్నారు ఆ దృశ్యాన్ని.

"ఓయ్! ఇది నిజంగా నిధే!" నలుగురూ అరిచారు ఒకేసారి.

"ఈ పెట్టెలన్నిటికీ తాళాలున్నై..ఏవైనా పెట్టెలు తెరచి ఉన్నాయేమో చూడండి" అన్నాడు రాజు జాగ్రత్తగా, ఆలోచిస్తూ. వెతికితే ఒక పెట్టెతాళం తెరచే ఉన్నది- నలుగురూ కలిసి ఆ పెట్టె మూతను ఎత్తారు- దాని లోపల, నిండా నోట్లకట్టలు!

"రాయలవారి కాలంలో కూడా నోట్ల మీద గాంధీ తాత బొమ్మే ఉండేదా?" అడిగాడు సంజయ్, ఆశ్చర్యపోతున్నట్లు.

"ఊరుకోండిరా! ఇక్కడ అంతా ఎంత పరిశుభ్రంగా ఉందో చూశారుగా? ఎవరో ఇక్కడికి తరచు వస్తూపోతూ ఉన్నట్లుంది. బహుశ: ఇక్కడికి వచ్చేందుకు ఇంకోదారి కూడా ఉండి ఉండచ్చు..ఇదంతా ఒకప్పటి రాయలవారి భూగృహమే అయినా, ఇప్పుడు మాత్రం ఎవరోదొంగలు డబ్బు దాచుకున్న చోటు అయిఉండచ్చని నా అనుమానం. మనం వెంటనే వెనక్కి వెళ్ళాలి; పదండి. ఈ పెట్టె మూత వేసేయండి గబగబా.." రాజు అందరినీ హెచ్చరించాడు.

నలుగురూ త్వరత్వరగా పెట్టెని మూసేశారు. ఆపైన గబగబా వెనక్కి తిరిగి మెట్లెక్కి సొరంగంలో పాక్కుంటూ పోయారు. తిరుగు ప్రయాణం మరింత సులభంగా సాగింది. ఇప్పుడు దారి బాగా తెలిసింది గద!

సొరంగంలోంచి బయటికి రాగానే పిల్లలందరూ బండను యథాస్థానంలోకి నెట్టారు. రాజు తన చేతి రుమాలును ఒక కట్టెపుల్లకు గుచ్చి సొరంగం ముందు జెండాలాగా నిలబెట్టాడు గుర్తుగా. అటుపైన నలుగురూ పరుగెత్తుకుంటూ ఊళ్ళోకి పరుగెత్తారు.

వాళ్ళు చేరుకునేసరికి సాయంత్రం అయ్యింది. బడి టీచర్లు వీళ్ళు నలుగురూ లేరని గుర్తించి కంగారు పడి, పోలీసులకు కబురు చేశారు కూడానూ. వీళ్ళు వెళ్ళేసరికి పోలీసుల బృందం ఒకటి, చేరుకొని ఉన్నదక్కడికి!

వీళ్లను చూడగానే అందరూ చిందులు వేశారు కాసేపు. అయితే వీళ్ళు తాము చూసిన "నిధి" వివరాలు, ఆ సొరంగం ముందు తాము ఉంచిన గుర్తులు చెప్పేసరికి, అందరూ నిర్ఘాంతపోయి నిశ్శబ్దం అయిపోయారు. ఇన్స్పెక్టరుగారు వెంటనే పై అధికారులకు ఫోన్ చేసి మాట్లాడారు. వాళ్ళేం చెప్పారోగాని, పోలీసులందరూ పిల్లల బృందాన్ని అక్కడే వదిలేసి హడావిడిగా వెళ్ళిపోయారు.

మరుసటి రోజున పత్రికల్లో అంతటా పెద్ద

వార్త వచ్చింది:

## దొరికిన బ్యాంకు దోపిడీ దొంగల ముఠా

### *పిల్లల సాహసంతో బయట పడ్డ నిక్షేపం*

హంపీ: ఆరు నెలల క్రితం హంపీలో జరిగిన బ్యాంకు దోపిడీ పాఠకులకు విదితమే. అలా మాయమైన కోట్లాది రూపాయలు నేడు తిరిగి లభించటంతో పాటు; ఆ దోపిడికి కారణమైన దొంగల ముఠా పూర్తిగా పట్టుబడిందని పోలీసు అధికారులు తెలియజేశారు. సాహసులైన పిల్లలు నలుగురు హంపీ యాత్రకు వచ్చిన రోజునే ఈ నిక్షేపాన్ని కనుగొనటం విశేషం. వారికి ఈ సంపదలో ఒక శాతాన్ని బహుమతిగా ఇవ్వనున్నట్లు అధికారులు ప్రకటించారు..."

దాన్ని చూడగానే ఉండబట్టలేక తాతయ్య ఫోన్ చేసేశాడు: "ఒరేయ్ పిల్లలూ! నేను ఊరికే ఏదో అంటే మీరంతా నిజంగానే నిధిని కనుక్కున్నట్లున్నారే!" అని ఆశ్చర్యపోయాడు.

"నువ్వేదైనా చెబితే అది నిజం కాక మరేమౌతుంది తాతయ్యా!" అన్నారు పిల్లలు నలుగురూ, ఇకిలిస్తూ.

మై నేమ్ ఈజ్ నాట్ ఖాన్!

**సినిమా పిచ్చి!**

బేరర్: మీకు ఏం టిఫిన్ కావాలి సార్?

వెంగళప్ప: ఏమున్నాయిరా డింభకా?

బేరర్: ఇడ్లీ, వడ, ఉప్మా, దోసె,..

వెంగళప్ప: ఒక్కొక్కటి కాదు షేర్‌ఖాన్! వంద ఇడ్లీలు ఒకేసారి పంపించు నిలపకుండా తినేస్తా. చట్నీ తక్కువ అయినా పర్వాలేదు, సాంబార్ ఎక్కువగా పంపించు.

*సేకరణ: మమత, తొమ్మిదవ తరగతి, వెంకటంపల్లి.*



# యుక్తి



*కథనం: తబ్బిబ్బు మహనందప్ప, విశ్రాంత ఉపాధ్యాయులు, మైదుకూరు, కడప జిల్లా.*

తాతయ్య మొదలు పెట్టాడు- "అపాయంలో ఉపాయం అంటే 'యుక్తి' అని అర్థంరా, పిల్లలూ. అంటే 'తెలివి' అన్నమాట. మనం ఏదన్నా ప్రమాదంలో చిక్కుకున్నామనుకోండి, అప్పుడు మన తెలివితేటల్ని వాడి, అపాయంలోంచి తప్పించుకోవాలన్నమాట! మీకో కథ చెబుతాను వినండి..

ఒక అడవిలో ఓ నక్క ఉండేది. ఒకసారి అది ముళ్ళదారిలో నడుచుకుంటూ వస్తున్నది. చెప్పులు వేసుకోదుగదా, దాని కాలులో పాపం, రెండు ముళ్ళు దిగబడ్డాయి. అది వాటిని పీకేసింది, కానీ ముళ్ళు లోతుగా దిగాయేమో, లోపలే విరిగాయి.

మరుసటి రోజుకల్లా నక్క కాలు వాచింది. అది ఇక వేటకు వెళ్ళలేకపోయింది. అంతలో అటుగా వచ్చిందొక పిల్లి. పిల్లిని చూడగానే

నక్కకు నోరూరింది. 'ఎలాగో ఒకలాగా దీన్ని అందుకుంటే చాలు' అనుకున్నది.

బాధతో గట్టిగా మూలిగినట్లు ఓ అరుపు అరిచింది. "పిల్లి బావా! పిల్లిబావా! ఓ సారి ఇటు రావా! నా కాల్లో ఎక్కడలేని ముళ్ళూ గుచ్చుకున్నట్లున్నై..నీ కోరపళ్ళతోవాటిని పీకి పెడుదువు కొంచెం" అన్నది.

"అయ్యో! నీకు నేనే దొరకాలా? నేను ముసలిదాన్ని, చూపు అసలే సరిగ్గా ఆనదు. ఇంక ముళ్ళెక్కడ కనిపిస్తాయి?" అన్నది పిల్లి విచారంగా, అక్కడే నిలబడి.

"అయ్యో! దానిదేముంది? నేను నీ మెడ వంచి పట్టుకొని, ముళ్ళు ఎక్కడ ఉన్నాయో ఆ భాగాన్ని నీ నోటికే అందిస్తాగా?" అంది నక్క, గడుసుగా.

పిల్లి ఏం తక్కువ తినలేదు. అది అన్నది "అబ్బ! నీకు ఏం చెప్పేది, నక్క బావా! నువ్వు ముల్లును అందించినా, దాన్ని పెరికేటట్లు లేదు నా నోరు! మొన్ననే తోడేలన్న వచ్చి 'నీ కోరపళ్ళొకసారి ఇవ్వు తమ్ముడూ' అని నా పళ్ళు ఎత్తుకు పోయాడుగా? అయినా దానిదేముందిలే, తోడేలన్న ఇల్లు ఇక్కడికి దగ్గరే. నేను పిలిస్తే అన్న పరుగున వచ్చి, నీ కాలి ముళ్ళు స్వయంగా తన పళ్ళతోటే పెరికి పెడతాడు" అని, గట్టిగా "అన్నా! ఓ..తోడేలన్నా, ఓసారి ఇటురా. నీకోసం నక్కబావ ఎదురుచూస్తున్నాడు" అని కేకలువేయటం మొదలుపెట్టింది.

తోడేలన్న మాట వినగానే నక్కకు విపరీతమైన భయం పట్టుకున్నది. "ఒద్దులే బావా! అంత పెద్ద వాళ్ళని ఇబ్బంది పెట్టటం ఎందుకులే! కొంచెం కష్టపడ్డానంటే నా అంతట నేనే తీసేసుకోవచ్చు వీటిని- చిన్న ముళ్ళేగా, ఏమీ పరవాలేదు" అని కుంటుకుంటూనే వెనక్కి పరుగెత్తిందది.

అర్థమైందా, అట్లా లేని స్నేహితుడి పేరు చెప్పి తన ప్రాణాలు కాపాడుకున్నదర్రా, పిల్లి! అపాయంలోఉపాయం అంటే ఇదే- యుక్తితో ప్రమాదం నుండి బయటపడటం!" అంటూ కథని ముగించాడు తాతయ్య.

కథనే తలచుకొని మురిసిపోతూ ఇళ్ళకు పరుగెత్తారు పిల్లలు. 

# చిలిపి ప్రశ్నలు

*రచన: వి.వి.యస్.మూర్తి,చొదిమెళ్ళ.*

1.కరెన్సీ నోటులో తెల్లని భాగం దేనికి!?

జవాబు: రఫ్ వర్కు చేసుకోటానికి.

2.'అర్ధరాత్రి' కి వ్యతిరేక పదం చెప్పమన్న తెలుగు మాస్టారు తలపట్టుకునేదెప్పుడు!?

జవాబు: 'అర్ధపగలు' అని విద్యార్థి అన్నప్పుడు.

3.అమ్మ అదిరిపడేదెప్పుడు!?

జవాబు: ఒకటోతరగతి చదివే కొడుకు "హోంవర్క్ చెయ్యటానికి నెట్ సెర్చ్ చేస్తున్నాను" అన్నప్పుడు.

4.పిల్లలు దేవుడితో సమానం, మరి వృద్ధులు.....!?

జవాబు: ఆస్తి వుంటే దేవుళ్ళు - లేకపోతే దెయ్యాలు.

5.పురాణ కాలంలో ప్రపంచ బ్యాంకుని ఏమని పిలిచేవారు?

జవాబు: కుబేరుడు.

6. కలికాలం అంటే?

జవాబు: 'అన్నమో రామచంద్రా' అన్న తోటి వాడికి అన్నం పెట్టకుండా ఆకలనే అడగని రామచంద్రుడికి నైవేద్యం పెట్టటం.

7.జాతకం చూపించుకోటానికి ఎవరి దగ్గరకెళితే మంచిది?

జవాబు: జాతకం చూసేవాళ్ళలో ఎవరి జాతకం బాగుందో తెలుసుకుని, అతని దగ్గరకెళ్తే మంచిది.

# కొబ్బరి నాది- చిప్పనీది!

ముళ్ళపూడివారిని స్మరించుకుంటూ..

చిత్రాలు: వినయ్, జెయన్‌టియు, హైదరాబాదు.



గడుగ్గూ, గడుగ్గూ! ఇదిగో, కొబ్బరి చిప్ప!



భలే, ప్రసూనా! భలే! గుడికి వెళ్ళి వచ్చావా? ఎక్కడిది నీకిది?



గుడికే వెళ్ళొచ్చాం. దీన్ని కొట్టుకొని తిందామా?



సరేలే, నేను నీకు సాయం చేస్తాను, వచ్చిన దాన్ని ఇద్దరం పంచుకుందాం, సరేనా?



సరేసరే.. ఆఁ!!? ఇదేంటి, నువ్వు కొబ్బరి తీసుకొని నాకు ఖాళీ చిప్ప ఇస్తున్నావేం?!



"..చూడు, నువ్వు కొబ్బరి చిప్ప తెచ్చావు; నేను రోకలి బండ తెచ్చాను. ఎవరి వాటా వాళ్ళది! అంతే!

# రూత్ ఏమోస్

యువ కెరటాలు-2

*నిర్వహణ: సౌమ్య, పుస్తకం డాట్ నెట్*



'రూత్ ఏమోస్' అని ఇంగ్లండులో ఒక అమ్మాయి ఉండేది. చాలామందిలాగే, ఆ పాప కూడా చక్కగా స్కూలుకు వెళ్లి చదువుకునేది. అయితే అలా అందరిలాగే మామూలుగా కొనసాగి ఉంటే, ఇప్పుడు ఆమె గురించి మనం ప్రత్యేకంగా చెప్పుకునే వాళ్ళం కాదు: ఇప్పుడు ఆ అమ్మాయి కొంచెం పెద్దదైంది- అయినా నిండా పాతికేళ్ళు లేని రూత్ సొంతంగా ఒక కంపెనీని నడుపుతోంది! అదీ అట్లా ఇట్లా కంపెనీ కాదు- పదిమందికి ఉపయోగపడే వస్తువునొకదాన్ని, గొప్పగా తయారు చేసి అందిస్తోంది.

ఆ మధ్య ఇంగ్లండుతో సహా అనేక దేశాల్లో ఆర్థిక మాంద్యం వచ్చింది. ఎన్నెన్నో గొప్ప గొప్ప కంపెనీలు మూతపడిపోయాయి. అలాంటి గడ్డు రోజుల్లో కూడా దాన్ని తట్టుకొని ధైర్యంగా నిలబడ్డారు కొందరు. ఆ తర్వాత అలాంటి మహిళా వ్యాపారవేత్తల గురించి "మేనేజ్‌మెంట్ టుడే" అనే పత్రిక వాళ్ళు ఒక జాబితా తయారు చేసారు. "35 under 35- '35 ఏళ్ళ లోపున్న 35 మంది' " అన్న పేరుతో. అప్పటికి రూత్ వయసు పందొమ్మిది సంవత్సరాలే- ఆమె కూడా ఈ జాబితాలో ఉంది! ఆ జాబితాలో ఉన్న అతి చిన్న వయస్కురాలు ఈ అమ్మాయే!! అంతే కాదు, 2006 లో 'యంగ్ ఇంజినీర్స్' అనే సంస్థ రూత్ ఏమోస్‌కి - "Young Engineer of the year" అవార్డు ఇచ్చి సత్కరించింది. ఇలా, రూత్ గురించి చెప్పాలంటే చాలానే ఉంది. అసలు ఇంత పేరు రావడానికి తను ఏమి చేసిందో తెలుసుకుందాం.

మనకు పదోతరగతిలో 'యస్.యస్.సి' ఉన్నట్లుగా, ఇంగ్లండులో పదోతరగతి స్థాయిలో

'జీ.సి.ఎస్.ఈ' ఉంటుంది. పదిహేను-పదహారేళ్ళున్న రూత్ లాంటి పిల్లలు చదువుతుంటారు 'జి.సి.ఎస్.ఈ'ని. ఆ తరగతిలో ఉన్న పిల్లలంతా ఏదో ఒక ప్రాజెక్టు చేసి చూపించాలి. సరిగ్గా అదే సమయంలో రూత్ వాళ్ళ టీచరుగారి నాన్నగారికి గుండెపోటు వచ్చింది. ఆ పరిస్థితిలో ఆయన్ని మెట్ల మీదినుంచి క్రిందికి నడిపించుకు రావటం పెద్ద సమస్యే అయ్యింది. ఇంకేముంది, టీచరుగారు రూత్‌కు పని అప్పజెప్పారు- ముసలితనం వల్ల కావొచ్చు, గుండెపోటు వల్ల కావచ్చు, మరే ఇతర కారణం వల్లనైనా కావచ్చు- సొంతగా నడిచేందుకు ఇబ్బంది పడేవాళ్ళు చాలామంది ఉంటారు- అలాంటి వాళ్ళు కూడా సులభంగా మెట్లు ఎక్కేందుకు, దిగేందుకు అనువుగా ఉండే పరికరం ఒకటి తయారు చెయ్యాలి. మరి ఆ పరికరం కూడా అందరికీ అనువుగా ఉండాలి; దానివల్ల కొత్తగా ప్రమాదాలేవీ తలెత్తకూడదు!



రూత్ చురుకైన అమ్మాయి. తనకు సైన్సు పాఠాలు చదవటం ఎంత బాగా వచ్చో, పరిసరాల్ని గమనించటమూ, వాటిని తనకు అనువుగా మలచుకోవటమూ కూడా అంత బాగా వచ్చు! సరే, ఆమె ఏమి చేసిందంటే, మెట్ల ప్రక్కనే రెయిలింగు ఉంటుంది కదా, దాన్ని పట్టుకుని నిలిచేట్లు ఇనుముతో ఒక కర్రలాంటి పరికరాన్ని తయారు చేసింది. మెట్లు ఎక్కేటప్పుడు, దిగేటప్పుడు దాన్ని ముందుకి తోసామంటే అది ముందుకు జరుగుతుంది. అయితే దానిమీద కొంచెం బరువు మోపామంటే చాలు- అది కదలకుండా ఉన్న స్థానంలోనే బిగుసుకు పోతుంది! దీనికి బ్యాటరీలూ అక్కర్లేదు; కరెంటూ అక్కర్లేదు! అర్థమైందా, దీన్ని ఎలా చెయ్యాలో? ఎటొచ్చీ దీనికోసం వాడే లోహం కొంచెం గట్టిగా, వంకరపోకుండా, అరిగిపోకుండా ఉండాలి. కొంచెం ఆలోచించారంటే ఇది ఎలా చెయ్యచ్చో మీకూ తెలిసిపోతుంది బహుశ:.

దీన్ని తయారు చేశాక రూత్ కు అర్థమైంది- తన ఆవిష్కరణ ఎంత ఉపయోగకరమైనదో.

వెంటనే వాళ్ల ఇంట్లోవాళ్ళు దీనికి "Stairsteady" అని పేరు పెట్టారు. "మెట్లు ఎక్కుతున్నప్పుడు, దిగుతున్నప్పుడు ఇది ముసలివాళ్లకి చేతి కర్రలా ఆసరాగా ఉంటుందన్నమాట . వృద్ధులకనే కాదు, రక రకాల రోగులకు- ఆసుపత్రులకు, దెబ్బలు తగిలి సరిగ్గా నడవలేకపోతున్న వాళ్లకు , ఇలా రకరకాల జనాలకు ఈ పరికరం చాలా ఉపయోగం!"



వెంటనే రూత్ వాళ్ళ ఇంట్లో వాళ్ళు ఈ పరికరాన్ని తయారు చేసే కంపెనీని ఒకదాన్ని మొదలు పెట్టేశారు. ఇళ్ళు, ఆసుపత్రులు, ఆఫీసులు- ఎక్కడని ఏముంది, మెట్లంటూ ఉన్న ప్రతిచోటా- పెద్దవాళ్ళు, రోగులు ఉండే ప్రతిచోటా- ఈ పరికరానికి పని పడుతోందట! ఇప్పుడు ఈ కంపెనీలో చాలామంది ఇంజినీర్లు ఉన్నారు! తమ దగ్గరికి వచ్చే వినియోగదారుల అవసరాలను బట్టి, ఆ పరికరంలో మార్పులు-చేర్పులు చేస్తూ ఉంటారు! ఇంగ్లండులోనే కాక, ఈ కంపెనీ పని ఇప్పుడు మరో రెండు మూడు దేశాలకు విస్తరించింది!

నిజానికి, ఈ పరికరాన్ని చూస్తే, దాని పని తీరు గురించి వింటూ ఉంటే- "ఓస్ ఇంతేనా!" అనిపిస్తోంది కదూ? అట్లా, 'మామూలు ఆలోచనలతోనే ఒక అమ్మాయి ఇలా పదిమందికీ ఉపయోగపడే ఒక పరికరాన్ని రూపొందించి, దాని ఆధారంగా ఒక కంపెనీనే నడుపుతోంది' అంటే గొప్పదే కదూ?!

రూత్ కి ఒక బ్లాగు-వెబ్సైట్ ఉంది. అందులో తన ఆలోచనలు రాస్తూ ఉంటుంది ఆమె. 'ఏం రాస్తోంది?' అని కుతూహలం కొద్దీ చూసాను. ఒక కంపెనీ అధినేతగా ఆమె రాసిన సీరియస్ వ్యాసాలు కొన్ని ఉన్నై, అందులో. అయితే వాటికంటే ఎక్కువగా ఆ వయసులో ఉన్న అందరు అమ్మాయిలూ రాస్తున్నట్లే - కొటేషన్లు, తాను ఇష్టంగా చేసుకునే వంటల విశేషాలు, తనకు ఇష్టమైన టీవీ సీరియళ్లవంటి సరదా విషయాలు- బోలెడు ఉన్నాయి. 'రూత్ ఆకాశం నుండి

ఊడిపడ్డంత సీరియస్ అమ్మాయి కాదు' అని అర్థమైంది దాన్ని చూస్తే.

రూత్ కథ నాకు ప్రత్యేకం ఎందుకు నచ్చిందీ, అంటే - తనంత చిన్న వయసులో అంత బాధ్యతగా ఒక కంపెనీని నిర్వహించగలిగే వాళ్లు తక్కువ. అలాగని, ఆ అమ్మాయి తన ఇష్టాల్నీ వేటినీ చంపుకోనూ లేదు; తన ఈడు వాళ్లు చేసే పనులేవీ చేయకుండానూ లేదు. చదువు ఆపెయ్యనూ లేదు- ఈ మధ్యే యూనివర్సిటీలో చేరిందట! అట్లా ఒక పక్క తన జీవితం; మరో పక్క తన వృత్తి -రెండింటినీ సమర్థవంతంగా నిర్వహిస్తున్నట్లు నాకు తోచింది.

అందరూ సరిగ్గా ఇలాంటిదే చెయ్యాలని లేదు: మన పరిసరాలను బట్టి, మన చుట్టూ ఉన్న వాళ్ళకి ఫలానా వస్తువు, ఫలానా యంత్రం, ఫలానా పరికరం అవసరం అనిపిస్తే, దాన్ని తయారు చేసేందుకు ప్రయత్నించడమే. రూత్ చేసింది అదే కదా - వాళ్ళ టీచర్ గారి నాన్నకి బాలేనందుకే కదా, ఈ ఆలోచన పుట్టింది? అందుకే రూత్ నుండి స్ఫూర్తి పొంది, స్కూలు పాఠాల మధ్య నుండి పుట్టుకొచ్చిన ఆలోచనలు అక్కడే వదిలేయక, ఎవరన్నా ఇంకాస్త ముందుకు వెళ్తారని ఆశిద్దాం.

**చూపిస్తే ఏడవాలా?**

జోకు

అమ్మ: రాజూ! తమ్ముడెందుకురా, ఏడుస్తున్నాడు?

రాజు: మరేం లేదమ్మా, వాడి దగ్గర ఒక చాక్లెట్ ఉండింది- నేను దాన్ని ఎలా తినాలో చూపించాను వాడికి. -అంతే, ఏడుపు మొదలెట్టేశాడు!

# సమీక్ష

*కొత్తపల్లి పత్రిక అక్టోబరు 2011 సంచికపై ఒక సమీక్ష-*
*నిర్వహణ: మాలతీకృష్ణ, విద్యార్థి సృజనకుటీర్, విజయవాడ.*




ముందుగా చెప్పాల్సింది, క్రొత్త శీర్షిక- యువకెరటాలు గురించి. సరైన చదువు లేదు; వనరులు లేవు; వెన్నుతట్టి దారి చూపించే పెద్దలు లేరు- ఏవీ లేవు- తన చుట్టూ ఉన్న మనుషులకు ఉపయోగపడే పని చెయ్యాలన్న దృఢ సంకల్పం తప్ప! 'విలియం కంకంబ్వా' వ్యాసం పిల్లలకే కాదు- పెద్దలకీ స్ఫూర్తినిస్తుంది.

మన భాషని ఇంకో భాష మింగేస్తోందని బాధ పడాలా, అన్ని భాషలూ ఒకటవ్వటంలోని సౌలభ్యం గురించి సంతోషించాలా? ఏదైనా, 'ఇ' భాష- ఇంగ్లీషేనని అనుమానం వచ్చింది, అందరికీ.

గంగమ్మ గారు బొమ్మకి కథలో పల్లె వాతావరణాన్నీ, ఆత్మీయతలనీ కళ్ళకు కట్టినట్లు చూపించారు. పల్లెటూర్లలో అమ్మమ్మలు, తాతయ్యలు ఉండే పిల్లలు అదృష్టవంతులు కదా! కాకపోతే ఈ కథ దీనికోసం ఇచ్చిన బొమ్మకు అంతగా సరిపోలేదనిపించింది. కొత్తపల్లిలో కథలు రాయమని ఇస్తున్న పిక్చర్ ప్రాంప్టులు ఏదో ఒక సన్నివేశాన్ని దృఢంగా చూపిస్తూ, తమంతట తాము ఆలోచన రేకెత్తించేట్లుగా ఉంటే బాగుంటుంది- అప్పుడు ప్రక్కన రాస్తున్న ప్రాంప్టింగ్ ప్రశ్నల అవసరమూ ఉండదేమో; పిల్లలు కూడా వ్రాయటానికి మరింత ఆసక్తి చూపించే అవకాశం ఉంటుంది కదా అనిపించింది.



పిల్లల కథలకొస్తే, 'కొత్తపల్లికో కథ' నిజంగా కొత్త ఆలోచన. గీతికకి భలే తమాషా ఐడియా వచ్చింది. 'మాట తీరు', 'పనీపాట', 'పొరుగింటి చీర', 'నేను సాధించాను', 'గొప్పకుపోతే'- కథలు పిల్లల్లా కనిపించే పెద్దలు వ్రాసినట్లు ఉన్నాయి- పట్టుమని పదిహేనేళ్ళు నిండని వీళ్ళు, మనుషుల్లో ఉండే బలహీనతలను ఎంత చక్కగా గమనించారు! నిర్భయంగా ఎదగటం, మంచి వ్యక్తులుగా రూపొందటం, ఆడంబరాలకు పోకుండా ఉండటం లాంటివి ఎంతో విలువైనవని వీళ్ళు గుర్తించటం చాలా ముచ్చటేసింది. ఈ కథల్లో వీళ్ళు వాడిన వాక్యాలు- 'నా మనసును అలుముకొని ఉన్న భయాల ప్రపంచాన్ని తాత్కాలికంగా మర్చిపోయాను (నేను సాధించాను)', 'అలా తెలిసింది- తామిద్దరూ ఒకే పడవలో ఉన్నామని (గొప్పకుపోతే)' లాంటివి, వీటిని రాసిన ఈ పిల్లల పరిణతినీ, భాషమీద వారికున్న పట్టునీ చూపించాయి.

నీతి చంద్రికలో 'విగ్రహం' మొదలవ్వటం బాగుంది. తెలుగు పాఠ్య పుస్తకాల్లోని కొరుకుడు పడని, మింగుడు పడని కంకర్రాళ్లలాంటి తెలుగును చదివీ చదివీ- గ్రాంధిక భాష అంటేనే వికారంగా మొహం పెట్టే పిల్లలకు ఈ కథలు తప్పకుండా మంచి ఊరట! 'మంచి తెలుగు- ఎంత రుచి!'




'నగరానికి దూరంగా' పాటలో తప్పక సవరించుకోవాల్సిన తప్పులు మూడు ఉన్నాయి- ఒకటి: ఈ పాటని రచించింది శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత శర్మ గారు. రెండు: రెండో చరణంలో 'తోట తెరువున (దారిన) గున్నమావి తోరణాలు కట్టినపుడు' అని ఉండాలి. మూడు: మూడో చరణంలో 'పొగమంచు అగరు పొగలు'(వాసనగల మంచు పొరలు) అనాలి. మంచి భాషని నేర్చుకునేందుకు ఇటువంటి అందమైన పాటలు ఎంత చక్కని సాధనాలో గదా?!

# పదరంగం-9

*ఈ పదరంగం చాలా సులభం! దీన్ని ఓ తెల్లకాగితంలో పూరించి పంపండి. మీ పేరుతో బాటు మీ బడి పేరు, తరగతి తప్పక రాయండి. సరైన సమాధానాలు పంపిన పిల్లల పేర్లను పదరంగం-11 తో పాటు ప్రచురించగలం. నిర్వహణ: దేవి, కొత్తపల్లి బృందం.*

| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | ■ |
| | ■ | | ■ | 4 | |
| ■ | 5 | | 6 | | ■ |
| 7 | | ■ | | ■ | 8 |
| 9 | | | ■ | 10 | |
| 11 | | ■ | 12 | | |

**ఆధారాలు:**

**నిలువు:**

1. ఒంటి కాలి మీద దీని జపం (2)
2. లేత ఆకులు (3)
3. పచ్చికాయల రుచి (3)
5. గుర్తులు (4)
6. దేవాలయం (2)
7. కవిత తిరగబడింది (3)
8. ఇక్కడ కాదు (3)
10. మెడలో అలంకరించుకొనేది (2)

**అడ్డం**

1. జంతువులనే మింగేటంత పెద్ద పాము (5)
4. బొగ్గు, బంగారం ఇక్కడ నుంచే తవ్వి తీస్తారు(2)
5. అయిదుగురికి ఇంకొకరు కలిస్తే?(4)
7. __ కోపమె__ శత్రువు (2)
9. పెళ్ళి(3)
10. కుక్క లాంటిదే(2)
11. చూసేవి, ఏడ్చేవి(2)
12. పాలు కాచినప్పుడు పైన వచ్చేదేమిటి?(3)

**పదరంగం-8 కి సరైన సమాధానం**



| | | | | | |
|---|---|---|---|---|---|
| 1 ఆ | ము | 2 దం | ■ | 3 త్రం | 4 చి |
| క | ■ | 5 డు | 6 ఆ | ■ | రు |
| 7 లి | 8 గా | ■ | 9 ఖ | జా | నా |
| ■ | డి | ■ | రి | ■ | మా |
| 10 మొ | ద | 11 లు | ■ | 12 గా | ■ |
| 11 న్న | ■ | 13 క | ను | రె | ప్ప |

దీనికి సరైన సమాధానం రాసి పంపినది:

1. బి. అసంగానంద రెడ్డి, నాలుగవ తరగతి, అజంతా స్కూల్, నెల్లూరు.

# పరుగుపందెం

రచన, గానం: "కవికాకి" కీ.శే.జైసీతారాం, కోగిర, అనంతపురం జిల్లా.

కుందేలు తాబేలు పందెమేసుకున్నాయి
చెరువునుండి కొండదంక పరుగెత్తే పందెము
కుందేలు చెంగు చెంగున ముందు ముందుకు పోయింది
దారిలోన చల్లనైన చెట్టు నీడను చేరింది
కాసేపు నిద్రిస్తానని గాఢ నిద్ర పోయింది
నిముషం కూడా తాబేలు నిలబడకుండా నడిచింది
చాల సేపుకు కుందేలు మేలుకొని చూసింది
ఇంకేముంది ఇంకేముంది తాబేలే గెలిచింది!





# ఎత్తండి!

*గానం: రవ్య, తొమ్మిదవ తరగతి, ప్రకృతి బడి, చెన్నేకొత్తపల్లి.*

ఎత్తండి! ఎత్తరే, స్వాతంత్ర్యపు జండాని?
ఒకే కంఠం ఒకే గమ్యం
ఒకే నినాదం మనదంట
ఒకే జాతి ఒకే నీతి
ఒకే పతాకం మనదంట ॥

భాషా వేషం ఏదైనా,
భారతీయులం మనమంతా
ఊరు పేరు వేరైనా
ఒకే కుటుంబం మనదంతా
ఒకే కంఠం ఒకే గమ్యం
ఒకే నినాదం మనదంట
ఒకే జాతి ఒకే నీతి
ఒకే పతాకం మనదంట ॥

జైహింద్ జయహే మనమాట
జనగణమన మన పాట
సమైక్యతే మన బాట
స్వాతంత్ర్యం మన తోట
ఒకే కంఠం ఒకే గమ్యం
ఒకే నినాదం మనదంట
ఒకే జాతి ఒకే నీతి
ఒకే పతాకం మనదంట ॥

**వెల:**

ప్రతి ఒక్కింటికి: 20 రూ.

12 పుస్తకాలకై చందా: 240 రూ.

"కొత్తపల్లి ట్రస్టు" పేరిట యంవో/డిడిని ఈ చిరునామాకు పంపండి: కొత్తపల్లి ట్రస్టు, యంఆర్‌వో ఆఫీసు దగ్గర, చెన్నేకొత్తపల్లి, అనంతపురం జిల్లా- 515101, ఆంధ్రప్రదేశ్.

బ్యాంకు అకౌంటు వివరాలు:
"Kottapalli Trust",
A/c No. 0138101018809 (savings), Canara Bank, Chennekothapalli. IFSC: CNRB0000138

ఫోన్లు: 08559 240222, 7702877670
ఇ-మెయిలు: team@kottapalli.in

**ఈ నెలలో ఏపని-ఎవరిది?**

ఆర్థిక వ్యవహారాలు, నిర్వహణ: సుబ్బరాజు

సంపాదకత్వం: నారాయణ

వెబ్సైటు, సమాచార సాంకేతికత: ఆనంద్

ముద్రణ: 'ముద్రిక' కృపాకరరావు

చిత్రాలు: వీరాంజి, అడవిరాముడు, రాము, అనిల్, ప్రసాద్, వెంకట్,వినయ్, లక్ష్మి, .

చిలిపిప్రశ్నలు: వివియస్ మూర్తి.

బొమ్మకు కథ: జి.లలిత, telugu4kids

సమీక్ష: వై.మాలతి. పదరంగం: దేవి

కథలు, పాటలు: చాలామంది పిల్లలు

**ప్రత్యేక కృతజ్ఞతలు:**

కార్టూన్ల వివియస్ మూర్తిగారికి, ప్రకృతి బడికి, విద్యార్థి సృజన కుటీరానికి, telugu4kidsవారికి, మాలతీ కృష్ణగార్లకి, రాధ రాజశేఖర్ గార్లకి, ఇంకా పేర్లు రాయని అనేకమందికి.

ఇంటర్నెట్‌లో http://kottapalli.in వద్ద కొత్తపల్లి పత్రికను చదవండి.

అందరు పిల్లల కోసం మీరూ కథలు రాసి పంపండి.

చందాదారులుగా చేరి నెల నెలా కొత్తపల్లిని పోస్టులో మీ ఇంటికి తెప్పించుకోండి.

మీ మిత్రుల తరపున చందాలు కట్టండి.

మీకిష్టమైన బడులకు, గ్రంథాలయాలకు కొత్తపల్లిని బహూకరించండి.

# అయ్యో! తెలుగు రాదే, ఎలాగ?!

"కథలమ్మా కథలు! కథలమ్మా కథలు! రకరకాల కథలు! తెలుగుపిల్లల కథలు!"

"ఏం కథలు బాబూ? మా పిల్లలకు తెలుగు చదవటం రాదు. ఇంగ్లీషు కథలు ఏమన్నా ఉన్నాయా, నీ దగ్గర?"

"ఇంగ్లీషువైతే వేరేవాళ్ళ దగ్గర దొరుకుతాయండి. నా దగ్గర ఉన్న సరుకంతా తెలుగువాళ్ల కోసమే. ఏం, మీ పిల్లలు తెలుగువాళ్ళు కారాండీ? పాపం, వాళ్ళకి కొంచెం తెలుగు నేర్పించకపోయారూ?"

"ఏమో నాయనా! మా వాళ్లకైతే ఇంగ్లీషు అంటేనే ఇష్టం. ఆ ఇంగ్లీషు నేర్చుకునేసరికే వాళ్ల తల ప్రాణం తోకకొచ్చింది. ఇంక తెలుగు ఎక్కడ నేర్చుకుంటారు?"

"అవున్లెండి, పాపం. కానీ నా దగ్గర ఉన్నవి తెలుగు కథలేనండి. మీకు పనికిరావు."

"ఏదీ, ఓసారి చూడనియ్యి- పుస్తకం బానే ఉన్నట్టుందయ్యా, కాయితం, రంగులు అదీనీ- దీన్ని పాపం ఇంగ్లీషులో అచ్చెయ్యకపోయారూ? మీకూ కొంచెం అమ్మకాలుండేవి గద! ఇప్పుడు పిల్లలంతా ఇంగ్లీషు బళ్లలో చదివీ చదివీ, తెలుగుని పూర్తిగా మరచే పోతున్నారుగా?"

"అవునండీ, అందుకనే వీటిని తెలుగులో మాత్రమే అచ్చేస్తున్నాం. మీ పిల్లలకి ఈ కథలు కావాలంటే వాళ్ళు తెలుగు నేర్చుకోవాల్సిందే, తప్పదు. లేకపోతే ఇంకో మార్గం ఉంది- మీరు వాళ్లకి చదివి పెట్టచ్చు-"

"అవున్లే, అట్లాగైనా వాళ్లకి మెల్లగా తెలుగు చదవటం వస్తుందేమో, చూస్తాను. కథలు చదవటం కోసమన్నా వాళ్ళు తెలుగు నేర్చుకుంటారేమో"

"తప్పకుండా నేర్చుకుంటారు చూడండి. అదేమంత బ్రహ్మవిద్య? తలచుకుంటే వాళ్ళు ఒక్క రోజులో నేర్చుకోగలరు. కథల్లో మాయ మీకు తెలీనిదా? మీరు చిన్నప్పుడు ఎన్ని కథల పుస్తకాలు చదవలేదు?"

"అవును నాయనా! ఇప్పుడు తెలుగు పుస్తకాలే కరువైపోతున్నాయి"

"ఏమీ లేదండీ! ఆదరించేవాళ్లు ఉంటే భాష చటుక్కున పుంజుకుంటుంది. ఏం చేసినా తెలుగులో అర్థమైనంత బాగా పరాయి భాషలో ఎంతమందికి అర్థమౌతుంది, చెప్పండి? ఏదో ఒక మాయ చెయ్యాల్సిందేనండీ. మీ పిల్లలకి 'తెలుగు రాదు' అని ఊరుకోకండి. ఏదో ఒకటి చేసి వాళ్ళ భాషని వాళ్ళకి ఇవ్వాలి- లేకపోతే కుదరదు."

"అంతేనంటావా?"

"అంతేనండీ- వేరే మార్గం లేదు. మాతృభాష తర్వాతే, వేరే ఏదైనా"

Edited, typeset and Published by Narayana for Kottapalli Trust, Near M.R.O.Office, Chennekothapalli-515101, Ananthapur District, AP. Ph:08559 240222 E-mail: team@kottapalli.in

మంచి పుస్తకం

# మృత్యులోయ

"యశపాలుడు, జయకేతుడు తృటిలో మృత్యులోయ చేరారు. కానీ అక్కడ్నించి తిరిగి మనలోకానికి రావటానికి నానా కష్టాలూ పడ్డారు.." అర్థమైంది కదా, కథ ఏంటో?

1971-74 ల మధ్య 'బొమ్మరిల్లు' పిల్లల తెలుగు మాసపత్రికలో ధారావాహికంగా వచ్చిన ఈ కథ, ఆ రోజుల్లో చదవటం వచ్చిన ప్రతివాడినీ ఒక్క ఊపు ఊపింది. దీనికోసమే బొమ్మరిల్లు పత్రికను కొన్న పిల్లలెందరో! పాత బొమ్మరిల్లులన్నీ సేకరించుకొని, ఈ సీరియల్ ఉండే పేజీలను మాత్రమే కట్ చేసుకొని ఒక పుస్తకంగా బైండ్ చేయించుకున్న వాళ్లెందరో!

ఇన్నాళ్లకు, వాహిని బుక్ ట్రస్ట్-మంచిపుస్తకం వాళ్ల పుణ్యమా అని, ఈ కథమొత్తం, ఆనాటి బొమ్మలతోసహా ఒక పుస్తకంగా అచ్చై దొరుకుతున్నది!

ఆరో తరగతి పిల్లలనుంచి పెద్దలవరకూ అందరినీ వదలకుండా చదివించగల "మహోజ్వల-ఉత్కంఠ భరిత-జానపద-నవలారాజం" ఇది. వెంటనే సంపాదించి చదవండి!



**మృత్యులోయ**

*రచన: దాసరి సుబ్రహ్మణ్యం*

ప్రచురణ:వాహిని బుక్ ట్రస్ట్-మంచిపుస్తకం

ప్రథమ ముద్రణ: జనవరి 2011

316 పేజీలు, వెల:150 రూ.

